# రచయితా - శిల్పమూ

రచన:

ఇల్యా ఎహ్రెన్‌బర్గ్

అనువాదం:

తుమ్మల వెంకటరామయ్య

ప్రచురణ:

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

# పరిచయం



సోవియట్ సాహిత్యంలోనే కాక ప్రపంచ సాహిత్యంలోనే ఒక ప్రముఖస్థానం పొందిన ఇల్యా ఎహ్రెన్‌బర్గ్‌ను పాఠకులకు వేరే పరిచయం చేయనవసరం లేదు.

సోవియట్ సాహిత్యంలో కొన్ని లోపాలను ఈ గ్రంథంలో ఎహ్రెన్‌బర్గ్ ప్రస్తావించినంతమాత్రాన, మరణ శయ్యపైనున్న పాశ్చాత్య సాహిత్యంతో దానిని పోల్చి అభివృద్ధి నిరోధకులు చంకలెగరవేయవచ్చు. కాని ఇప్పుడున్న ఉన్నత స్థితినుండి మరింత మహోన్నత స్థితికి సాహిత్యాన్ని కొనిపోడానికే ఎహ్రెన్‌బర్గ్ ఈ రచనలో కొన్ని సమస్యల్ని లేవదీశాడు.

సోవియట్ సాహిత్యంలోని లోటుపాటులను గురించి వ్రాస్తూ ఈ గ్రంథంలో ఎహ్రెన్‌బర్గ్ లేవనెత్తిన సమస్యలు ఒక సోవియట్ యూనియన్‌కే పరిమితమైనవి కావు. వాస్తవికతా, సోషలిస్టు వాస్తవికత మొదలైన విషయాలపై జిజ్ఞాసాపరులైన అభ్యుదయ రచయితలకు ఈ గ్రంథం ఎంతో ఉపకరించుతుంది.

ప్రచురణ కర్తలు.



# రచయితా : శిల్పమూ

## 1

లెనిన్‌గ్రాడ్ యువ ఇంజనీర్ ఒకరు ఇటీవలనే నా కొక ఉత్తరం వ్రాశారు. "మన జీవితంకన్నా మన కల్పనా సాహిత్యం ఎందుకింత బలహీనంగా, నిస్సారంగా ఉంది ? ఇటీవల ఈ విషయమై చర్చించుతున్నాం. కాని ఎవరూ తగు సమాధానం ఈయలేక పోయారు. జార్ కాలంనాటి రష్యాకో నేటి సోవియట్ సమాజాన్ని పోల్చ వీలులేదు. అయినప్పటికీ అప్పుడు గొప్ప గ్రంథాలు రచించ బడినాయి. ఇప్పుడు అత్యాసక్తితో చదువదగిన గ్రంథాలు సోవియట్‌లో కొన్ని వున్నాయన్నమాట నిజమే. కాని మరికొన్ని పుస్తకా లున్నాయి. అవి ఎందుకు రచించారా అని ఆశ్చర్యపోతాం. అంతా సక్రమంగానే వున్నట్లు ఆ రచనలలో కన్పించుతుంది. కాని ఏదో కొంతలోటు వాటిల్లో కన్పడుతుంది. అవి నిన్ను తన్మయులను చేయవు. నీహృదయంలోకచొచ్చుకుపోవు. ఆరచన లలోని ప్రజలు వాస్తవిక జీవితంలోని ప్రజలుకారు."

ఇలాంటి అభిప్రాయాలను వినడం ఇది మొదటిసారి కాదు. రచయిత పనితనం (Craft) గురించి నా అభిప్రాయాలను పాఠకులకు అందీయాలని ఈలేఖ నన్ను ప్రోత్సహించింది.

ఇప్పుడు నేను చెప్పబోయేది వ్యక్తిగతాభిప్రాయం మాత్రమేననీ, నా వ్యక్తిగత అనుభవం ఆధారంగా వ్రాస్తున్న దనీ వేరే చెప్పనక్కరలేదు. మా సోషలిస్టు సమాజంపై ప్రేమ, ఆ సమాజ భవిష్యత్తులో మావిశ్వాసం, సోవియట్ రచయిత లందరినీ ఐక్యపరచింది. కాని మేము విభిన్నవిషయాలపై ఎవరి ధోరణిలో వారు వ్రాస్తాం. మాలో ఒక్కొక్కరి అనుభవం వేర్వేరుగా వుంది.

రచయితలంతా నేను వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయా లను నిస్సందేహంగా అంగీకరించుతారు. కాని చాలామంది మరికొన్ని అభిప్రాయాలతో విభేదించుతారు.

మయకోవస్కీ ఒకసారి ఇలా అన్నాడు.

"కవి అవడానికి నిబంధన లేమిటని అడిగితే నేనేమీ నిబంధనల్ని సూచించలేను. నిజానికి అలాంటి నిబంధనలంటూ లేవు." నవలా రచయిత కావాలన్నా, అలాంటి నిబంధన లేమీ లేవు. ఈ విషయమై ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించాలని గాని, సలహా ఇవ్వాలని గాని నా ఉద్దేశంకాదు. అలా సలహా ఇవ్వడం నమ్రతను సూచించక పోవడమేగాక బుద్ధి హీనత కూడా అవుతుంది. విభిన్న రచయితలు విభిన్న మార్గాల ద్వారా సాహిత్యంలో ప్రవేశించుతారు. ప్రతి రచయితా తన స్వంత పద్ధతిలో వ్రాస్తాడు. సృజనాక్రమంలో కూడా ప్రతి రచయితకూ ఒక్క స్వంత మార్గం వుంటుంది. నేను నా రచనా పద్ధతిని ఎలా అర్థం చేసుకుంటున్నానో అది మాత్రమే చెప్పదలచాను.

మన సాహిత్యంకన్న మన జీవితం ఎంతో విస్తృతమైన దని సజీవనమైనదని పై వుత్తరం వ్రాసిన ఇంజనీర్ చెప్పడం సరియైనదే. మనకిప్పుడు లియోటాల్‌స్టాయ్‌లు లేరు. సాల్టి కోవ్ - షెడ్రిన్‌లు లేరు. చెకోవ్‌లు, గోర్కీలు లేరు. (దీని అర్థం మనకు చక్కని రచయితలు లేరనిగాని, మంచి నవలలు లేవనిగాని కాదు.) ఒక్కొక్క శకంలో మహా మేధావులు జన్మించడం, మరొక శకంలో జన్మించకపోవడం 'కర్మ' అని గానీ, ప్రకృతి స్వభావం అని గానీ మనం భావించరాదు. లెనిన్ గ్రాడ్ ఇంజనీర్ వేసిన ప్రశ్నకు సమాధానం ఈయాలంటే రచయిత పనితనపు స్వభావాన్ని గురించే చర్చించవలసి వుంటుంది.

ఎమెచ్యూర్ ఫొటోగ్రాఫర్ కామెరా మీట నొక్కు తాడు. నడుస్తున్న లేక పరుగెత్తుతున్న వ్యక్తి ప్రతిబింబం శీఘ్ర గ్రాహియైన ఫిలిమ్‌లో ముద్ర పడడానికి ఒక సెకండులో నూరవ వంతైనా చాలు. చిత్రకారుడు ఒక వ్యక్తి నమూనాను (Model) తయారు చేసేటప్పుడు అతని ముఖంలోకి చాలాసేపు చూస్తాడు. అతని రూపు రేఖలలో అతని స్వభావం, ఆంతరంగిక జీవితం ప్రతిబింబించుతున్నదేమో కనిపెట్టడానికి ప్రయత్నించు తాడు. చిత్రకారుని లాగానే రచయితకూడా, తన పాత్రలను బహు శ్రద్ధగా అధ్యయనం చేస్తాడు.

మనకంటె మన పూర్వపు మహా రచయితలకు వ్రాయడం సులభం. కారణం - చాలా నెమ్మదిగా మారుతూ వున్న సమాజాన్ని వారు వర్ణించారు.

సాల్టికోవ్-ష్చెడ్రిన్ బానిసవిధానం నిర్మూలింపబడిన కాలంలో నివసించాడు. అతని రచనలలో ఆనాటి సామాజిక పరివర్తనలు ప్రతిబింబించినాయనే మాట నిజమే. పాంప డూర్ల (Pompa durs) రాజ్యంలోగాని గోలోవ్ల్యోవ్ల (Golovlyovs) కుటుంబాలలో గాని గాఢమైన నైతికమార్పులు (Spiritual changes) లేవు. చెకోవ్ మొదట్లో వ్రాసిన కథలలోని స్త్రీ పురుషులు అతని తర్వాత రచనలలో కూడ తిరిగి ప్రత్యక్షమౌతారు. రచయిత శైలి మారింది, కాని నమూనాలు మారలేదు.

మన (సోవియటు) సమాజం మన కళ్ళముందే నిర్మించ బడుతూంది. నేడందరికి సంబంధించిన సమస్యలపై వ్రాసిన నవలలు ఇంకా సజీవంగానే వున్నాయి. (పాతవి కాలేదు.) అవి వాటి సాహిత్య ప్రతిభను కోల్పోకుండా చరిత్రాత్మకమైన నవలలుగా తయారయ్యాయి. "ది నైంటీన్" (దళం) "ది వర్జిన్‌సాయిల్ అప్ టరన్డ్" (బీళ్ళుదున్నేరు) అనేవి ఇందుకు ఉదాహరణలు. ఇటీవల ప్రపంచ యుద్ధంలోని వీరులు "చాపయేవ్", "ది ఐరన్ ఫ్లడ్"లలోని పాత్రలవంటి వారు కారు.

నేటి కాలేజి విద్యార్థులు 1925 లో కార్మికుల హైస్కూళ్ళల్లో చదివిన యువతీయువకుల వంటివారు కారు. మార్పులేవని భావించబడే మనోవికారాలు (Emotions) ఆశ్చర్యకరమైన వేగంతో మారుతున్నాయి. ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంనాటి యువతీయువకుల భావాలకూ (Feelings) నేటి ప్రేమిక దంపతుల భావాలకూ ఎక్కడా పొంతనలేదు.

టాల్‌స్టాయ్, తుర్గెనివ్, గోంచరావ్, చెకోవ్‌లకు తమ పాత్రల ఆవేశ స్వభావం, భావాలూ అన్ని పరిస్థితులలోనూ తెలుసు. త్వరత్వరగా మారిపోతున్న సమకాలిక వ్యక్తుల ఆలోచనలను, చిత్తవృత్తులను తెలిసికొనడం నేటి సోవియట్ రచయితకు చాలా కష్టం.

ఇదివరకే నెలకొనివున్న సమాజ చిత్రాన్ని బట్టబయలు చేయడంగాని, లేక ఊరికే వర్ణించడంగాని ఒకఎత్తు. చరిత్రలో ఇదివర కెన్నడూలేని ఒక సమాజాన్ని, ఇప్పుడు నిర్మాణావస్థలో వున్న ఒక సమాజాన్ని, రచయితకూడా ఆ నిర్మాణంలో భాగస్వామిగావున్న సమాజాన్ని, చిత్రించడం మరోఎత్తు. ఈ రెండింటికీ పోల్చడానికే వీలులేదు.

అప్రయత్నంగా వెన్వెంటనే ఈ ప్రశ్నవస్తుంది. నేటి బూర్జువా సమాజంలోని రయితల పరిస్థితి ఏమిటి? వారి కర్తవ్యం చాల సులభంగా ఉన్నట్లు కన్పించుతుంది. మరణ శయ్యపైఉన్నా, ఇంకా బ్రతికేవున్న ప్రపంచాన్ని చిత్రించడం వారిపని. అయినప్పటికీకూడా ఆధునిక పాశ్చాత్య సాహిత్యం లోని భావదారిద్ర్యంచూస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఫ్రాన్సు, ఇంగ్లండ్, అమెరికాలలోని సుప్రసిద్ధ విమర్శకులే ఈవిషయాన్ని అంగీకరించుతున్నారు.

గత శతాబ్దంలోని పేరెన్నికగన్న రచయితలు - రోమా రోలా, డ్రీజర్, బెర్నార్డ్ షా, హామ్సున్ (అతడు చివరకు నీచంగా చనిపోయినా అతని మొదటి నవలలోని ఉత్కృష్టతను మరచిపోలేం) వెల్స్, రోగర్ మార్టిన్ డ్యుగార్డ్, గాల్స్‌వర్దీ, హాప్ట్‌మాన్, హేన్రిక్ మాన్, పిరాండెలోలు - గత రెండు

ప్రపంచయుద్ధాలమధ్యకాలంలో అద్భుతమైనరచనలు కొనసాగిం చుతూనే వచ్చాయి. ఇదేకాలంలో అమెరికాలో బహు చక్కని నవలలు, పరిశుత్వ మానవతత్వాలను వర్ణించిన నవలలు, వచ్చాయి. హెమింగ్వే, కాల్డ్ వెల్, స్టీన్ బెక్, ఫాల్క్‌నర్ లు వ్రాసిన మొదటి నవలలలో రచయితల చిత్తశుద్ధి, గాఢమైన నిస్పృహ పాఠకుల్ని ఆకర్షించాయి. కొందరు విమర్శకులు వారిని నిరాశావాదులు అని నిందించారు. జాతి వివక్షతా విధానం, పేరాశతో లాభాలు గుంజే పద్ధతి, కిరాతకత్వం, మానవ నైతిక ఔన్నత్యాన్ని భంగపరచడం, వీటన్నిటికి వ్యతిరేకంగా సమాజంలోని అభ్యుదయకాముక ప్రజలు సాగించిన పోరాటాన్ని చిత్రించిన రచయితలు అమెరికాలో అప్పుడు కూడా వున్నారని వేరే చెప్పనక్కరలేదు. కాని అమెరికాలోని అభ్యుదయవాదులు అపుడు ఇంకా బలహీనం గానే వున్నారు.

లక్షలాది బాబిట్‌ల (Babbits) 'పేటెంట్' (కృత్రిమ) నవ్వుకు వ్యతిరేకంగా నిస్పృహను – తాము చూచినదానిని – నిరాశావాదులని నిందింపబడిన యీ రచయితలు వర్ణించారు.

రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో, బూర్జువా యూరప్‌లోని రచయితలు మారియక్, డొబ్లిన్, జూల్స్ రొమైన్స్, మొరావియా, జాయిస్, రాట్, మొదలైనవారు తమ నవలలలో పెట్టుబడిదారీ సమాజం ఎలా వట్టిపోయిందో, వృథాఅయిందో, వర్ణించారు. అలాంటి పుస్తకాలను నేడు పాశ్చాత్యదేశాలలో వ్రాయడంలేదు. నేను పైన ఉదహరించిన

రచయితలలో కొందరు చనిపోయారు. మరికొందరు మౌనం వహించారు. ఇంకా కొందరు నైతికంగా పతనమయ్యారు.

రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో బూర్జువా ప్రపంచ రచయితలు తమ సమాజపు పతనం ఖాయమని గ్రహించారు. కాని అందుకై ప్రశాంతంగా శోకించడానికి తగిన వ్యవధిమాత్రం ఇంకా వారికి మిగిలింది. వారి నిస్పృహ ఒకపరిధిలోనేవుంది. అందుచే కళాత్మక రచనలలో దానిని ఇమడ్చడానికి వారికి అవకాశం వుంది. కాని తమ పాత్రలకు - ఆమాట చెప్పాలంటే తమకే - మరునాడేమి జరుగుతుందో నేటి పాశ్చాత్య రచయితలకు తెలియదు. ఒక సంవత్సరంలో నీ నెత్తిపైన ఆటంబాంబు పడుతుందని చెబుతున్నపుడు, ఒక వీధిలో అమెరికా సైనికులు, మరో వీధిలో సమ్మెదారులు నడుస్తున్నప్పుడు, ఒక నవలను గురించి ఆలోచించడం కష్టం. కొంతమంది రచయితలు వార్తా పత్రికలలో ఉన్మత్త ప్రేలాపనలు సాగించారు. మరి కొందరు మానసిక రోగ పరిశీలకులకూ, నేరచట్ట ప్రవీణులకూ అభిరుచి కల్గించే విషయాలను - ఎక్కడోగాని జరగని విషయాలను - ఇష్టం లేకపోయినా వర్ణించ మొదలు పెట్టారు.

శిథిలమౌతున్న సమాజంలోని రచయితల దౌర్భాగ్యం అలా వుంది. కాని బూర్జువా దేశాలలోకూడ మంచి రచయితలున్నారు. వారి పుస్తకాలు రచయితను ద్రవింపజేస్తాయి. పాశ్చాత్య ప్రపంచంలోని ధనిక దేశాలలోగాని బీద దేశాలలోగాని కొరతపడి వున్న ఆశను వారు తమ పాఠకుల మనసులలో

హా త్రింపజేస్తారు. ఈ కొత్తపుస్తకాలు కొత్త పాఠకులను సంపాదించాయి.

లాటిన్ అమెరికాలో సాధారణ ప్రజలు మొట్టమొదటి సారిగా నవలలు, పద్యాలు చదవడం, లాటిన్ అమెరికా రచయితల గ్రంథాలు మొట్టమొదటిసారిగా ప్రపంచాన్ని చుట్టుముట్టడం ఆశ్చర్యకరంగాదా?

"రూబెన్ డారియో" కవితను తెలిసినవాళ్ళు యూరప్ లో కొద్దిమందే వున్నారు. కాని నేడు నెరూడా, అమాడో, గ్విల్లెన్‌ల పుస్తకాలను ఆపేక్షతో చదవని యూరపియన్ సాహితీ ప్రియుడు ఎవడూ లేడు.

రైతులకు, గనిపనివారలకు నావికులకు తెలిసిన రచయిత టర్కీలో ఎవరైనా ఇదివరలో వున్నారా? విదేశాలలో సైతం సుపరిచితమైన టర్కీ రచయిత ఎవరైనా ఇదివరలో వున్నారా?

కాని నేడు నజీమ్ హిక్మత్ కవిత లక్షలాది ప్రజల హృదయాలలోకి చొచ్చుకుపోయింది. రేనో కార్మికులు వాలెరీ పద్యాలు చదివారా? కాని ఇప్పుడు పాల్ ఎలార్డ్, లూయీ ఆరగాన్‌ల పద్యాలను (అవి సులభంగా గ్రహించడానికి వీలులేనివైనా) చదువుతున్నారు. ఫ్రెంచి ప్రభుత్వ ప్రతినిధులు విదేశాలలో తమ దేశ ప్రతిష్టను గురించి గొప్పగా చెప్పుకోవలసి వచ్చినపుడు ఈ ప్రముఖుల పేరును వారు ఉదహరించక తప్పడంలేదు.

"అమెరికాలో గత తరం రచయితలు" అని పేరుపడ్డ రచయితల ప్రతిభ, రెండో ప్రపంచ యుద్ధకాలంనుండి వెల వెల

బోయింది. కాని హోవర్డ్ ఫాస్ట్ ప్రజ్ఞ ఇనుమడించి ఎంతో బలపడింది. నే నుదహరించిన రచయితలు బూర్జువా సమాజంతో తెగ తెంపులు చేసుకున్నారు. అందు చేత నేనా వారు ఉత్తమ రచయితలుగా నాకు కన్పించుతున్నది ? కాదు. వారు నిజంగానే ఉత్తమ రచయితలు. ఇతరులకంటె పరిణతి చెందిన మేధావులు గనుక నేవారు భవిష్యత్తువైపు అభిముఖులయ్యారు.

పాశ్చాత్య దేశాలలో ఒక రకం పాఠకులున్నారు. అపరాధ పరిశోధక నవలలతోను ఒకరకం సెంటిమెంటల్ కథలతోను "రీడర్సు డైజెస్టు"లాంటి పత్రికలు అన్నీ ప్రచురించే నీతిమాలిన చెత్తా చెదారంతోను వారు సంతృప్తి చెందుతారు. మరికొన్ని దేశాలలో ఈ రకపు పాఠకులు ఇంకా చాలమంది వున్నారు.

కాని వారినే ఆ దేశంయొక్క భవిష్యత్తు అనిగాని, అంతరాత్మ అనిగాని, గుండెకాయ అనిగాని అనలేం. పనిచేసే పాఠకులు, సృజనచేసే పాఠకులు, ఆలోచించే పాఠకులు మంచి పుస్తకాల్నే కోరుతారు.

ఫ్రాన్సులో, స్కాండినేవియన్ దేశాలలో, లాటిన్ అమెరికా దేశాలలో సోవియట్ నవలలు అనువదించబడి విజయ వంతంగా వ్యాప్తి చెందాయి. అవి ఎలా వ్రాశారు అనే దానికన్న, అవి వేటిని వర్ణించుతున్నాయనే దానిని బట్టే ఈ విజయం ఆధారపడి వుంది.

ఇటీవలనే ఒక ఫ్రెంచి యువ రచయిత – యువకుడే అయినా అప్పుడే అతడు సుపరిచితుడుకూడా – వ్రాసిన ఒక

నవలను చదివాను. ఆ నవలలోని కథానాయకుడు యువకుడు; హోమో సెక్సుయలిస్టు. ఆ స్త్రీకోసమని ఒక ముసలావిడను అతడు పెళ్ళిచేసుకొంటాడు. పెళ్ళిచేసుకొన్న తర్వాత ఆరాత్రిని రచయిత వివరంగా వర్ణించుతాడు. తన సోదరిని చూడటానికి కథానాయకుడు వెళతాడు; వెళ్ళి ఆమెతో రమిస్తాడు. అలాంటి పుస్తకాలతో విసుగెత్తిన ఫ్రెంచి పాఠకుడు "ది యంగ్ గార్డ్" "హార్వెస్ట్" లాంటి సోవియట్ నవలలో పరిశుభ్రమైన వాతావరణాన్ని చవిచూస్తాడు.

పాశ్చాత్య దేశాల సంధ్యాకాలం ముగిసింది. అస్పష్టమైన నీడలు దానిని ఆవరించి భయాన్నీ, మనఃక్లేశాన్నీ కల్గించాయి. ఇపుడు చీకటి రాత్రి అక్కడ ఆవరించింది.

కళలు వికసించి, విజయోపేతమైన సామరస్యం ఏర్పడి అద్భుతరచనలు అనేకంగా వెలువడిన కాలం ప్రతి సమాజానికీ ఒకప్పుడు వుంటుంది. అలాంటి కాలాన్ని మహోన్నత దశ అంటాము. సోవియట్ సమాజం అభివృద్ధిలో ఇప్పుడే ఉషః కాలం ఆరంభమయింది. చరిత్రలో కొన్ని దశాబ్దాలు కొన్ని గంటలు మాత్రమే. మా రచయితలు వేగులవంటివాళ్ళు (Scouts); అందుచేతనే మా కింకా పుష్కిన్‌లూ, టాల్‌స్టాయ్‌లూ లేరు. కాని తప్పకుండా అలాంటి రచయితలు అవతరిస్తారు. మా సమాజపు ఆ మహోన్నతదశ ఇంకా ముందు వుంది.

ఫ్రాన్సుకు నేడు బాల్జాక్, స్టెంధాల్, హ్యూగో, ఫ్లాబర్ట్, జోలాలు లేరు. ఇంగ్లండుకు నేడు డికెన్స్, బైరన్,

షెల్లీ లులేరు. మరొక కొత్త స్టెంధాల్ లేక డికెన్స్ జన్మించా లంటే ఆ దేశాలలో చాలా మార్పు రావాలి. ఈలోగా వారికి వెనుకబడివుండక తప్పదు.

## 2

పాఠకుడు సాయంత్రం కిటికీ తలుపులు బిగించి దీపం వెలిగించి ఓ పుస్తకాన్ని తెరచి చదవడం ప్రారంభించుతా డనుకోండి. అతడేదో పెద్దదీర్ఘ యాత్ర చేసినట్లు అతనికి కన్పించుతుంది ఆ గ్రంథంలోని పాత్రలు అదే పట్టణంలో, అదే వీధిలో ఉన్నప్పటికీ. పాఠకుని గమ్యస్థానం ఏమిటి ? ఈ పుస్త కంలో తాను కనిపెట్టగలనని అతడు ఆశించే దేమిటి ?

చరిత్రకు సంబంధించిన నవల అయితే అది విజ్ఞానాన్ని విస్తృతం చేయవచ్చు. చరిత్ర పుటలకు జీవం పోయవచ్చు. పీటర్‌ను గురించి అలెక్జి టాల్‌స్టాయ్ వ్రాసిన నవలనుంచి పీటర్ ది గ్రేట్ కాలాన్ని అధ్యయనం చేయడం కష్టం. కాని పీటర్ కాలంనాటి భావనలను ఈ నవల వ్యక్తపరచుతుంది.

పాఠకునికి తెలియని స్థలానికి సంబంధించిన నవల లేక అతనికి తెలియని వాతావరణం చిత్రించే నవల, అతని విజ్ఞా నాభివృద్ధికి పనికివస్తుంది. పాఠకుడు తన భూగోళ జ్ఞానం నెమరు వేసుకోడం జరుగుతుంది. ఒకరు మరొకరి జీవిత విధానాన్ని తెలిసికోడానికి ఉపయోగపడుతుంది. "అండ్ క్వాయిట్ ఫ్లోస్ ది డాన్" అనే నవలలో కోసక్‌ల జీవితాన్ని యెంత విస్తృతంగా చిత్రించినప్పటికీ, అందులోని ప్రకృతి దృశ్యాలు ఎంత మనో

హారంగా వర్ణించినప్పటికీ, అవి షోలొకొవ్ తన పాత్రల ఆంత రంగిక ప్రపంచాన్ని చిత్రించడానికన్నా ఎక్కువ ఉపయోగ పడవు. ఆ నవలలోని గ్రిగరీ కథమీదనే పాఠకునిదృష్టి అంతా కేంద్రీకరించబడి వుంటుంది.

ఉక్కు ఎలా చేయాలనే దానికి, లేక ఆధునిక భవన నిర్మాణం తెలుసుకోవడానికి పాఠకుడు ఆయా ప్రవీణులవద్దకు వెళతాడు. కాని ఈవిషయంలో "భోగట్టాను ప్రోగుచేసిన" లేక ప్రవీణులు చెప్పిన విషయాన్ని దాదాపు హృదయపూర్వకంగా ఇముడ్చుకున్న రచయితవద్దకు వెళ్ళరు. ఒక నవలా రచయిత కన్న అనుభవంగల వ్యవసాయదారుడు వ్యవసాయ విషయాల గురించి చెప్పగలడు. ఎంతో కష్టపడి వ్రాసే నవలా రచయిత కన్నా సైనికవ్యూహ సిద్ధాంతకర్త, స్టాలిన్‌గ్రాడ్ యుద్ధాన్ని గాని, కుర్‌స్క్ మలుపువద్ద జరిగిన యుద్ధంగురించిగాని బాగా చెప్పగలడు.

అయితే తనతోటి పౌరులకన్నా, సమకాలికులకన్నా బాగా రచయిత తెలుసుకోవలసిన రంగం యింకొకటివుంది. అది మానవుని ఆంతరంగిక ప్రపంచం. ఒకపాత్ర ఆకారాన్ని, దాని పరిసరాలను వర్ణించాలంటే, దాని ఇల్లుకాని అది పనిచేసే ప్రదేశం గాని కావాలి. కాని అది అంతకష్టమైన పనికాదు. అలాంటి వర్ణనలు సాధనాలే కాని లక్ష్యాలు కావు.

ఉదాహరణకు ఒక నవల ఇవనోవ్ అనే అతన్ని గురించి అనుకుందాం. ఇవనోవ్ పాఠకుని పొరుగింటివాడను కొందాం. ఈ పాఠకునికి ఇవనోవ్ ఆకృతిగాని జీవిత విధానంగాని ఏమీ రహస్యంకాదు. పాఠకుడు ఇవనోవ్‌ను చాలసార్లు చూచి

వుంటాడు; మీటింగులలో మాట్లాడటం వినివుంటాడు; ఇలిచ్ కూడ అతనితో మాట్లాడివుంటాడు. ఇవనోవ్ ఎంత [illegible] సగటుమను ష్యుడే అయినా అపరిచితభూమి లాంటివాడే. తన [illegible] ఇవనోవ్ ఆలోచనలనూ, దుఃఖాన్నీ, [illegible], ప్రేమనూ, [illegible] రచయిత చూపగల్గితే పాఠకుడా [illegible] [illegible], తానెంతో తెలుసుకోగల్గానని అనుకుంటాడు. ఇవనోవ్‌ను అర్థంచేసుకోగల్గానని భావించుతాడు. ఆ విధంగా తనన్ను తాను కూడా బాగా అర్థంచేసుకోగల్గానని తెలుసుకోగల్గుతాడు.

ఇవనోవ్ లోహ కార్మికుడైతే, లోహ పరిశ్రమలో అతని పాత్రనుగురించి కూడా రచయిత చిత్రించాలని వేరే చెప్ప నక్కరలేదు, మానవ జీవితంలో పని ఒక భాగం. అందులోనూ మన సమాజంలో అదిచాలా ప్రధానస్థాన భాగం. అలాంటి పరిస్థితిలో లోహ పరిశ్రమను గురించి కూడా రచయిత తెలుసుకొనివుండాలి. అయితే ఇవనోవ్‌ను సర్వతో ముఖంగా చిత్రించడానికే ఆ లోహపరిశ్రమ కర్మాగారాన్ని రచయిత చిత్రించుతాడుకాని, మిల్లింగ్ మెషీన్‌ను చిత్రించ డానికిగాను ఇవనోవ్‌ను వర్ణించడు.

తనకంటె రచయిత మానవ మనోనైజాలను గాఢంగా అధ్యయనం చేశాడనీ, యక్స్‌రేల్లాంటి కళ్ళు రచయితకు ఉన్నాయనీ పాఠకుడు భావించుతాడు. తన సహచరుల, సమ కాలికుల, స్నేహితుల, శత్రువులను గురించి విశేష పరిజ్ఞానం లభించుందేమోనని ఒక నవల ప్రారంభించిన తర్వాత పాఠకుడు ఆశించుతాడు. తన జీవితాన్ని శోధించి పరిశీలించ

డానికీగాను తనను గురించి వాస్తవ పరిపూర్ణ జ్ఞానాన్ని పొందాలని అతడు ఆశించుతాడు.

లియోటాల్‌స్టాయ్ వర్ణించిన నాటి సమాజ ఆచారాలు గాని, ఆ సమాజ మూఢనమ్మకాలుగాని నేడు లేవు. కాని త్రెఖ్‌గోర్నయా టెక్స్‌టైల్ మిల్లులలోని ఒక కార్మిక స్త్రీ, ఆనాకెరినినా బాధలు తలపోసుకుని విలపించుతుంది. అరక్షిత ప్రేమిక హృదయాన్ని, నూత్న ప్రేమబలాన్ని ఆమె గ్రహించుతుంది. గత కాలపు ఈ గాధ తన హృదయపు లోతుల్ని చూడడానికి ఆ యువతికి తోడ్పడుతోంది.

చనిపోయిన పాత సమాజపు ఆచారాలను గురించి నేర్చుకోడానికేగాక, మానవమనోవికారాల (Emotions) క్లిష్ట స్వభావాన్ని అర్థంచేసుకోడానికి కూడా టాల్‌స్టాయ్ నవలను ఆధునిక పాఠకుడు చదవడానికి ఉపక్రమించుతాడు.

టాల్‌స్టాయ్ అవగాహన చేసుకోలేని సామాజిక వైరుధ్యాలను లెనిన్ అద్భుతంగా చిత్రీకరించాడు. రష్యా అవలంబించవలసిన మార్గాలేవో లెనిన్‌కు స్పష్టం. కాని టాల్‌స్టాయ్ వాటిని చూడలేకపోయాడు. టాల్‌స్టాయ్ తత్వశాస్త్రంలోని నిరర్థకతను బయటపెట్టడానికి మాత్రమే కాదు అతని రచనలను లెనిన్ చదివింది. మానవుని ఆంతరంగిక ప్రపంచాన్ని సంపూర్ణంగా అవగాహనం చేసుకొనేందుకు ఈ మహా రచయిత లెనిన్‌కు తోడ్పడ్డాడు.

త్రెఖ్‌గోర్నయా మిల్లులలో పనిచేసే ఒక కార్మిక యువతి సోవియట్ రచయితల మహాసభలో అన్నమాటలు ఇక్కడ జ్ఞప్తికి తెస్తున్నాను. టెక్స్‌టైల్ కార్మికుల గురించి

కథలను, నవలలను వ్రాయలేదని ఆమె నిందించింది. ఇది జరిగి ఇరవై ఏండ్లయింది. టెక్స్టైల్ కార్మికులే కథానాయకులుగా గల పుస్తకాలు ఆ రోజుల్లో చాలామంది వ్రాశారు. కాని మిల్లు లైబ్రరీలోని ఈ పుస్తకాలకోసం కార్మికులు ఎక్కువ ఆసక్తి చూపేవారుకాదు. అక్కడి స్త్రీలకు తమ సమకాలికులను వర్ణించడం కన్నా టెనిన్, వ్రాన్స్కీలు అంటే ఎక్కువ అభిరుచివుంటుందా? ఉండదు. దానినిబట్టి టెక్స్టైల్ కార్మికులను గురించివ్రాసిన ఆ నవలలు అక్కడి యంత్రాలను వర్ణించాయి కాని ప్రజలను వర్ణించలేదు. ఉత్పత్తిక్రమాన్ని వర్ణించాయి కాని మానవుని భావనలనుగాదు.

# 3

కోట్లకోలది సోవియటు ప్రజలకు ఉక్కు ఎలా తయారు చేయడమో తెలుసు. యాపిల్ పండ్లలో అనేక రకాలను ఆ తోటలనిపుణులు ఎలా ఉత్పత్తిచేస్తారో వారికి తెలుసు. అనేక అంతస్తుల పెద్దపెద్ద మేడలను ఎలా కడతారో వారికి తెలుసు. కాని నవలలను ఎలా ఉత్పత్తి చేస్తారో పాఠకులందరికీ తెలియదు. సృజనాత్మక కళయొక్క మనస్తత్వాన్ని (సైకాలజీ) చాల తక్కువమంది అధ్యయనంచేశారు.

ఒకానొక రచయితయొక్క విజయాన్నో, విఫలతనో విశదీకరించే పనికి పూనుకొనే మన విమర్శకులు, కళాత్మకరచన (గ్రంథం) ఎలాపుట్టిందో దానికి సంబంధించిన సమస్యలపైన ఏమైనా కొంత వివరణ చేస్తారా? లేదు. దురదృష్టవశాత్తు

మొదటిరకం విమర్శకులు సాహిత్యపండితులు ఇంకా మనకు కొద్దిమందే వున్నారు.

కొంతమంది విమర్శకులకు రెండే రెండు రకాల పుస్తకా లుంటాయి. బహుమతి పొందిన నవలలు, పూర్తిగా ఖండించ దగిన నవలలు.

మొదటిరకం పుస్తకాలను సమీక్షించేటప్పుడు విమర్శ కులు స్కూలువిద్యార్థిలాగా ఆ పుస్తకాలలోని విషయాలను వర్ణించుతారు. చివరకు తమ స్వతంత్రతను నిలబెట్టుకోడానికి, "అతిగా పొగిడాడు" అనే నిందలను ముందుగా తప్పించుకో డానికీ, ఆ నవలలో ఏదో ఫలానిది లోపించిందని చెబుతూ అందుకు రచయితను నిందించుతారు.

పూర్తిగా ఖండించదగినవని అభిప్రాయపడ్డ నవలలను సమీక్షచేసేటప్పుడు అలాంటి విమర్శకులు పబ్లిక్ ప్రాసిక్యూ టర్ల పాత్రవహించుతారు. మంచి ఉద్దేశ్యాలతో ఒక రచయిత ఒక నవలను వ్రాశాడనుకోండి. అది జయప్రదం కాలేదను కోండి. ఆ రచయిత చిత్తశుద్ధిని ఏమాత్రం సందేహించవలసిన అవసరంలేదనుకోండి. అయినా ఆ నవలను రచించడం ఒక నేరం అని ఆ విమర్శకులు భావిస్తారు.

అలాంటి నవలలను గురించి మాటాడేటప్పుడు విమర్శ కులు, ఆ పుస్తకాలలోని విషయాలను ప్రస్తావించరు. అక్కడా ఇక్కడా కొన్ని వాక్యాలను లాగి వాటిని రచయితకు వ్యతిరే కంగా, సాక్ష్యంగా ఉపయోగించి ఉదహరించుతారు.

ఒక నవలను స్తుతించేటప్పుడు, లేక పూర్తిగా ఖండించే టప్పుడు, ఆ రచయిత వ్రాసిన యితర పుస్తకాలకూ,

ఈ నవలకూ సంబంధం ఏమిటి? అన్న విషయాన్ని తరచుగా ఆలోచించనే ఆలోచించరు. పరీక్షాధికారులలాగా వాళ్ళు మార్కులిస్తారు గాని, రచయిత విజయానికి గాని, వైఫల్యానికి గాని కారణాలను విశదీకరించరు. కళాత్మక రచనలు ఎలా ఉత్పత్తి అవుతాయి? రచయిత స్వభావానికీ, అతని రచనకూ ఎంత సన్నిహిత సంబంధం వుంది? మొదలైన విషయాలను వివరించరు.

సోవియట్ యూనియన్‌లో లాగా రచయిత లంటేను, సాహిత్యం అంటేను వున్న అభిరుచి ఎప్పుడూ ఇదివరలో ఎక్కడా లేదు. పాఠకులనుండి రోజూ వందలాది లేఖలు రాని రచయితలు సోవియట్‌లో ఉన్నారని నేననుకోను.

వినయభావంలేదని నిందిస్తారనే భయాన్ని లక్ష్య పెట్టకుండా రచయితలు, తమ పాఠకులకు తమ రచనలను ఎలా ఊహించారో చెబుతున్నారా? తమ సాటి రచయితల పుస్తకాల గురించి వారు వ్రాస్తున్నారా? ఒక కళాత్మక రచనను ఎలా పోషించి బయటకు తెచ్చారో అనుభవంద్వారా వారికి తెలుసు. తమ* సోదరరచయితల పుస్తకాలను మంగళాచరణంకోన్నో, శాపనార్థాలకోనో వీరుచూడ నవసరంలేదు. సృజనాత్మక కళకు మూలం ఏమిటో వారు విశదీకరింపవచ్చు.

మన రచనానుభవం గురించి, లేక ఇతరుల పుస్తక రచనానుభవంపై మన అభిప్రాయాల గురించి మన రచయితలు సాధారణంగా పాఠకులకు తెలియజేయరు.

కొందరు విమర్శకుల వ్యాఖ్యలలో పాఠకునికి శాప నార్థాలు తప్పకుండా కన్పించుతాయి. చాలకాలం మహానముద్ర

నహించి ఏమీ వ్రాయలేదని ఒక్కొక రచయితను వారు ఆడిపోస్తారు.

మరొక రచయిత యుద్ధంగురించి వ్రాసిన నవలలో తమ మాతృభూమికి సంబంధించిన వీరులను సృష్టించనందుకు అతనిని దండించుతారు. తగినంత ఆశను వెలిబుచ్చే పాత్రలు లేవనో, లేక అతి ఆత్మవిశ్వాసం కలిగియున్నాయనో మరో రచయితను నిందించుతారు. ఇలాంటి వ్యాసాలతో పాటు పాఠకులకు రచయితలనుండి కొన్ని హామీలు కూడా పత్రికలలో కన్పించుతాయి. ఫలానాఫలానా ప్రాజెక్టు నిర్మాణం గురించో, లేక ఫలానా పరిశ్రమశాఖను గురించో తాము నవలలు వ్రాయదలచామని ఆ రచయితలు చేసిన వ్యాఖ్యానాలు అందులో కనబడతాయి. జాతీయఆర్థిక విధానం లోని ఫలానాశాఖను గురించి నవలలు వ్రాయవలసిందని పత్రికాసంపాదకులు తమను ఫలానాచోటికి పంపుతున్నారని కూడా వారు వ్రాస్తారు.

(ఇక్కడ నా ప్రకటనను వెంటనే వివరించవలసిన అవసరం వుంది. ప్రయాణం చేయడంవల్ల రచయితకుండే లాభాలను నేను కాదనడంలేదు. కాని చేతిలో నోట్ బుక్ పెట్టుకొని ప్రయాణంచేసే రచయిత నవలకు కావలసిన "సామగ్రిని ప్రోగుచేయగలడా" అని సందేహం. సఖాలిన్‌ను సందర్శించిన తర్వాత చెకోవ్ కొన్ని స్కెచ్‌లు వ్రాశాను. ఆ ప్రయాణం చెకోవ్‌ను విజ్ఞానవంతుని చేసింది. ప్రజలను మరింత బాగా తెలుసుకొనేటట్లు సహాయపడింది. కాని అతని కథలలో ఆయన సఖాలిన్‌కు సంబంధించిన కథావస్తువులను తీసుకోలేదు.

(ఒక రచయితను మీరు మోల్డావియాకు, లేక యాకూషియాకు, లేక విదేశాలకు పంపవచ్చు. అతడు జర్నలిస్టుగా బాగాపనికి వస్తాడు. స్కెచెస్ వ్రాయడం కష్టం; అది ముఖ్యమైన రచనా విధానంకూడా. ఒక రచయితను విదేశాలకు పంపినంతమాత్రాన, అతడు తిరిగివచ్చేటప్పుడు తన సూట్ కేస్‌లో ఒక నవలకు కావలసిన జీవసామగ్రిపెట్టుకొని వస్తాడని అనుకోవద్దు. ఒక నవలను వ్రాసేటప్పుడు రచయితకు ఒక పట్టణాన్నో, ఒక ఫ్యాక్టరీనో సందర్శింపవలసి వుండవచ్చు. కాని, ఇదంతా అతడు పుస్తకం వ్రాయడానికి ఇచ్చిన ప్రేరేపణకు అనుబంధం మాత్రమే.)

ఆ విధంగా సాహిత్య సృజన ఒక విధంగా పారిశ్రామిక వస్తువుల ఉత్పత్తిలాగా కన్పించవచ్చు. తనకు రుచించనివస్తువును అమ్మడానికి ప్రయత్నించినపుడు, కొనేవాడు అమ్మేవానిపై కోపపడవచ్చు. తనకునచ్చిన డిజైన్‌లో ఆ వస్తువు లేదని అతడనవచ్చు. అలాగే కొందరు పాఠకులు, ఫలానా ఫలానా పరిశ్రమ నిర్మాణాన్ని వర్ణించలేదనో, ఫలానావృత్తిని వర్ణించలేదనో, కొన్ని మనోభావాలను వర్ణించలేదనో (అతడు ఇతరవిషయాలను బాగా వర్ణించినా) అనవచ్చు.

మన కళ్ళముందరే సమాజం మారుతున్న కాలంలో, చాలా త్వరితగతిని ప్రజలు అభివృద్ధిచెందుతున్న కాలంలో, మనం నివసించుతున్నాం. అయితే ప్రజలంతా ఒకేవేగంతో లేక ఒకేవిధంగా అభివృద్ధిచెందరు. అందుచేతనే, భావవైరుధ్యాల (Spiritual Contradictions) మధ్య దిక్కుతెలియని రచయిత తన పాత్రల ప్రవర్తనను తప్పుగా చిత్రించుతాడు.

అలాంటి రచయిత తప్పులను బయటకు తీసుకురావాలి. కోర్టు విచారణలాంటి రుచిచూపించే విమర్శనాత్మకవ్యాసాలు లేకుండానే యిది సాధ్యమవుతుందని, మార్క్సిస్టు ప్రామాణిక గ్రంథాలు (క్లాసిక్స్) మనకు తెలియజేశాయి.

సాహిత్య విమర్శకులు, రచయితల మనోరథపు పొరబాట్లనుకూడా బయటపెట్టాలి. ఉదాహరణకు ఒక రచయిత గ్రంథంలో పాత్రల ప్రవర్తన పూర్తిగా, సరిగా వివరించబడినా, ఆ పాత్రలు సజీవంగా వుండవు. అలాంటి పొరబాట్లను బయట పెట్టాలి. తాను వ్రాసేగ్రంథం తనలో ఒక పరిపూర్ణ భాగం అని రచయిత భావించని పుస్తకాలు, తన రచనకు ప్రసవవేదన లాంటి శ్రమను పడనిపుస్తకాలు – రచయిత ఉద్దేశ్యాలు ఎంత సదుద్దేశ్యాలయినప్పటికి కూడా – సాధారణంగా అవి చాలా తక్కువరకం పుస్తకా లవుతాయి.

అలాంటి రచయితకు తన పాత్రలతో పరిచయమూ వుండదు. వాటిని అర్థమూ చేసుకోలేడు. సృజనాత్మక రచన యొక్క మనస్తత్వం తెలిసివుంటే, విమర్శకులు అతని అపజయాలను విశదపరచడానికి అవకాశం వుంటుంది.

రచయిత దేనిపైబడితే దానిపైన ఎవరిపైబడితే వారిపైన వ్రాయలేడు. విషయాన్ని ఎన్నుకోడంలోను, పాత్రలను ఎన్నుకోడంలోను ప్రతి రచయితకూ ఒక పరిమితివుంది. ప్రతి రచయితకూ, అతడెంత పెద్దవాడైనా, కొన్ని అడ్డుగోడలున్నాయి. ఒక నవలారచయిత, తాను నివసించే సమాజంచేత నడపబడతాడు. ఈ విషయం అందరికీ తెలిసినదే. కాని

రచయిత స్వీయ చరిత్ర, తన అనుభవం, తన ప్రవర్తనచేతకూడా ప్రభావితుడై తన రచన సాగిస్తుంటాడు.

---

# 4

మన నవలలు, చిన్న కథలు కొన్ని పాఠకునిలో ఉపేక్షాభావం కలుగ చేస్తున్నాయని లెనిన్‌గ్రాడ్ ఇంజనీర్ వ్రాసిన విషయం నిజమే. శిల్పం సరిగా లేనందున ఇలాంటి భావం కల్గుతోందని విమర్శకులంటారు. కాని ఇందుకు కారణం మరోచోట వుందని నా భావం.

పాఠకుని ఉద్విగ్నపరచే రచయితలు మనకున్నారు. దాదాపు వారంతా మంచి శిల్పులే. పాఠకుని కదల్చని రచనలు కూడా కొన్నివున్నాయి. వాటిలో తప్పనిసరిగా శిల్పం లోపించిందని అనడానికి వీలులేదు. గత పదేండ్లలోను మన రచయితల శిల్పం పెరిగింది. యుద్ధానికి పూర్వంకంటె మామూలు నవల లేక కథ పూర్వంకన్నా ఎక్కువస్థాయి కలిగివుంది.

ఒకసారి, విప్లవానికి పూర్వపు పత్రికల ఫైళ్ళను తిరగేస్తున్నాను. "రస్కోయీ బొగాటస్ట్వొ" (Russian Riches "రష్యా సంపద") "జర్నల్ డ్ల్యా వెక్" (Magazine for all "అందరి పత్రిక") "సొవ్రెమెన్నీ మిర్" (Modern World "ఆధునిక ప్రపంచం") మొదలైన పత్రికలను తిరగవేస్తున్నాను. ఆనాటిల్లో చెకోవ్, గోర్కీ, బ్లాక్ మొదలైనవాళ్ళంతా వ్రాస్తున్నారు. వారితోపాటు డజన్లకొద్దీ మామూలు నవలా రచయితలు, కవులూ, వ్రాసినవి ప్రచురించబడినాయి. వీరి

రచనలు చాలా నిస్సారంగాను మోటుగాను వున్నాయి. వారి రచనలతో నేటి సాధారణ సోవియట్ రచయిత రచనలను పోల్చిచూస్తే, ఇప్పటి మన రచయితలే బాగా వ్రాస్తున్నారని చెప్పాలి.

కొన్ని పుస్తకాలు చప్పగా వున్నాయని లెనిన్‌గ్రాడ్ ఇంజనీర్ భావించడానికి కారణం వాటిలో శిల్పం లోపించడం వల్ల కాదు. కనీసం అదొక్కటే కారణంకాదు.

బాగా వ్రాయడం ఎలా అని ప్రశ్నించినపుడు లియో టాల్‌స్టాయ్ చాలా విలువైన సలహాలు రెండిచ్చాడు : (1) నీకుసైతం అభిరుచి కల్గించని వాటినిగురించి వ్రాయకపోకు. (2) పుస్తకం వ్రాయాలని నీకు ఉద్దేశంవుండికూడా, నీవు తప్పనిసరిగా దానిని వ్రాసితీరాలి అన్న భావం నీలో కల్గకపోతే, అసలు వ్రాయడమే మానివేయి.

యాంత్రికంగా ఘటనలను నమోదుచేసే యంత్రం కాదు రచయిత. పుస్తకాలు వ్రాయడం తెల్సుసుకదా అని అతడు పుస్తకం వ్రాయడు, లేక సోవియట్ రచయితల సంఘంలో సభ్యుణ్ణికదా అనీ వ్రాయడు. ఇంతకాలంగా నీవు ఒక పుస్తకం అన్నా వ్రాయలేదేమని రచయితలను అడగవచ్చు. జీవించడానికి సంపాదించుకోవాలి గదా అనీ రచయిత పుస్తకాల్ని వ్రాయడు. ప్రజల కేదో చెప్పాలని అతనికి ఉండబట్టే, ఏదో వ్రాయాలని అతని బుర్రలో 'బాధ' కలగబట్టే, ప్రజల్ని, విషయాల్ని చూచాడుగాబట్టే, తమను వర్ణించమని ఆలోచనలు మస్తిష్కంలో గోల పెట్టబట్టే అతడు వ్రాస్తాడు. అలా జన్మించాయి ఉద్విగ్నమైన పుస్తకాలు. ఒక్కొక్కపుడు వాటిలో

కళాత్మకమైన లోపాలు కన్పించినప్పటికీ, అవి ఇంకా రచయితను తప్పని సరిగా ద్రవింపచేస్తూనే వున్నాయి.

ఈ కారణంచేత, వాల్గా – డాన్ కాలువ గురించో, టెక్స్టైల్ పరిశ్రమగురించో, శాంతి ఉద్యమం గురించో ఒక నవల వ్రాయలేదని రచయితను తప్పు పట్టే కొందరి విమర్శకులను నేను అర్థం చేసుకోలేను. ఈ పుస్తకం రాయకపోయినా కాలం వెళ్ళబుచ్చగలిగిన రచయితను, అంతఃప్రేరణ లేకుండా అలాంటి పుస్తకాలను వ్రాసినందుకు నిందిచితే తప్పేమిటి? పారిశ్రామిక ఉత్పత్తిలో ముఖ్యపాత్ర వహించే లెక్కలు (Statistics) కళలోకూడ అదే పాత్రను వహించవు. వంద తుక్కు నవలలకంటె ఒక్క మంచి నవల మంచిదనే నా అభిప్రాయంతో మీరేకీభవించుతారని అనుకొంటాను. నవలలు వంట చెరకులా (బొగ్గు) ఉపయోగపడే వస్తువులుకావు. లేక చెప్పులవలె అరిగిపొయ్యేవీ కావు.

ఎడారి దీవిలో రచయిత మనస్సులో మేఘావృత బింబాలు సాక్షాత్కరించవచ్చు. కాని అతను వాటిని గురించి పుస్తకం వ్రాయడానికి ప్రేరణ కల్గించకపోవచ్చు. రచయితలు ప్రజల గురించి ప్రజలకోసం వ్రాస్తారు.

మార్సెల్ ప్రౌస్ట్, ధ్వనిచొరబడని కార్క్ (Cork) గోడలగదిలో గ్రంథాలను రచించాడట. దీనిని ఆదర్శంగా రసజ్ఞులు చెబుతూవుంటారు. అయితే ప్రౌస్ట్ యీ నిశ్శబ్ద భవనంలో పనిచేసేముందు, ప్రజలతో కలిసి నివసించాడనీ, ఫ్రాన్సులోని సాంఘికజీవితాన్ని తీక్ష్ణంగా అధ్యయనంచేశాడని వీరు మరచిపోతున్నారు.

వాస్తవిక సాహిత్యం ఎప్పుడూ సమాజజీవితంతో సంబంధం కల్గియుంటుంది. రచయిత ఒంటరితనం, రచయిత 'గదులుకట్టుకుని' నివసించుతాడనడం (Ivory tower) మొదలైనవి బూర్జువాసమాజం క్షీణించడం మొదలుపెట్టగానే ప్రారంభమయ్యాయి; ప్రపంచ జాబితా పూర్తి అయిందని నవలా రచయితలు తలచినపుడు, వాస్తవానికి బదులు స్వప్నాలు ఆ స్థానంలో రావాలని వారు నిర్ణయించినపుడు, పైనచెప్పిన విషయాలు ప్రారంభమయాయి. (నేనిక్కడ యింకోమాట చెప్పవలసియుంటుంది. స్వప్నాలు, అన్ని స్వప్నాలలాగానే, వాస్తవాన్ని ప్రతిబింబించుతాయి. అయితే ఆ ప్రతిబింబం వక్ర ప్రతిబింబం.)

కళాకారుని ఊహాలోచన (Imagination) దృశ్య ఘటనల, భావనల, కృత్యాల పాళ్ళను మార్చవచ్చు. కాని అన్ని నవలలు - విచిత్రమైన (fantastic) లేక ఊహాగానం చేసే (Utopian) నవలలైనాసరే - వాస్తవంమీదనే ఆధారపడి వుంటాయి. వెల్సురచనలలో అంగారక గ్రహం (Mars) లోని మనుష్యులు, కాపెక్ నీరుఉడుము (Newt) యివన్నీ కూడా మానవసమాజంపై అపహాస్యంచేసే వినోదానుకరణ (Parady) లే. వెల్సు సృష్టించిన అంగారక గ్రహంలోని మనుష్యులు, కాపెక్ సృష్టించిన నీరుడుములు - ఇవన్నీ మన సమాజ అనుకరణలే. ఏదుపుముఖం ప్రభువును ఊహించి చిత్రించేముందు సెర్వాంటిస్ తన సమకాలికులను బాగా ఎరిగి వుండాలి. వాస్తవానికి (రియాలిటీ) దూరంగా కళ అనేది లేదు, ఉండబోదు.

సాంఘిక పరిసరాలు రచయిత భావాలను, ఆవేశాలను, జీవితాన్ని, రచనలను నిర్ణయించుతాయి. తన పరిసరాలకు తన సమాజానికి దూరమయితే రచయిత సృజనాత్మక కళ విషయంలో శుష్కించి చనిపోతాడు. పాశ్చాత్యదేశాల సాహిత్యం కంటె ఎక్కువగా రష్యన్ సాహిత్యం ఎప్పుడూ ప్రజలతో సన్నిహిత సంబంధం కలిగివుంది. సామాజికంగా శూన్యవాదం లోకి తప్పించుకొనిపోయే ఉదాహరణలు ఇందులో చాలా తక్కువ. పుష్కిన్ తర్వాత కాలంలో ఆయన వారసులుగా పేర్కొన దగినవారిని చాలా కొద్ది ఉదాహరణలు మాత్రమే యివ్వవచ్చు. నాశిరకం కవులు నవలా రచయితలు, తమ జీవిత ప్రారంభములో సాంకేతికవాదులు (సింబాలిస్ట్సు) గా వున్నవారూ ఇలా కొద్దిమందిని ఉదహరించవచ్చు. (చాలమంది సాంకేతికవాదులు తర్వాత జీవితంతో సంబంధం పెట్టుకోడానికి ప్రయత్నించారు. ఉదాహరణకు అలెగ్జాండర్ బ్లాక్ విషయం లో ఇది స్పష్టంగా కన్పించుతుంది. "సుందర యువతిని గురించి గేయాలు" (Poems about a beautiful lady) వ్రాసిన బ్లాక్ తర్వాత "నెమెసిస్" (పశ్చాత్తప్తన్యాయం) గురించి, రష్యా గురించి పద్యాలు వ్రాశాడు. చివరకు The Twelve (పన్నెండు) అనే రచన సాగించాడు.)

సోషలిస్టు సమాజంలో రచయితకూ ప్రజలకూ మధ్య సంబంధం వుండడమేగాదు. అలా వున్నదనే భావాన్ని స్పష్టంగా గ్రహించుతారు కూడా. ఒకప్పుడు సమాజవిధిని నిర్వర్తించడమనికూడా దానిని పిలుస్తారు. కాని కొందరు సంపాదకులు, విమర్శకులు "విధి" అనే పదాన్ని వదలివేస్తారు. "సామాజిక"

అనే పదాన్ని విస్తరింపజేసి "వ్యవహార సరళి తెలిసిన ప్రపంచం"గా ఆ పదాన్ని మార్చివేస్తారు. కాని రచయితల శిల్పానికి "వ్యవహారసరళి తెలిసిన ప్రపంచం" అనేది బొత్తుగా సరి పడని విషయం.

విప్లవానికి పూర్వం రచయితల పరిస్థితి అంత సరళంగా వుండేదికాదు. వార్తా పత్రికలు, మాసపత్రికలు కథలు పంపించవలసిందని ఆజ్ఞాపించిన ఘటనలు, చెకోవ్ ఉత్తరాలలో కన్పడుతుంది. అయితే ఎంతటి మొరటు సంపాదకునికికూడా ఆయనకు ఫలానివిషయంమీాద కథ వ్రాయవలసిందని సూచించే సాహసం ఉండేదికాదు. "ఆనా కెరనినా"ను వ్రాయమని టాల్‌స్టాయ్‌ను, "అమ్మ" అనే నవలను వ్రాయమని గోర్కీని ఎవడైనా ప్రచురణకర్త ఆజ్ఞాపించడానికి సాహసించగలడని ఊహించగలమా ?

తాను ఏ విషయం గురించి ఏమి వ్రాయాలో ప్రతిదీ చెప్పించుకోవలసినంత వ్యక్తిత్వంలేని రచయిత ఎవడూ ఉండడు.

రచయితలకు యిష్టంలేకుండా, ఎవరో ఒక పత్రికా సంపాదకవర్గం ఆజ్ఞాపించితే వ్రాసిన పుస్తకాలు ఎవడికైనా కావాలా ? టాల్‌స్టాయ్ చెప్పిన పై సలహాను కాలదన్ని, తనను కదిలించని విషయాన్నిగురించి వ్రాస్తే, ఆ పుస్తకం పాఠకుని కూడా కదల్చదు. దాని ఫలితం లెనిన్‌గ్రాడ్ ఇంజనీర్ వ్రాసినట్లు "ఆ రచనలో ప్రతిదీ వుంటుంది. కథ బాగానే ప్రారంభమవుతుంది. సుఖాంతంగానే ముగుస్తుంది. కొంత ఘర్షణ, కొంతవరకు ప్లాటూ వుంటుంది. అయితే అందులో ఆత్మ

శూన్యం. ఎంతో సానుభూతిగల పాఠకునిగూడా అది ఉత్సాహ పరచదు."

# 5

బూర్జువా సిద్ధాంతాలను పట్టుకొని ఊగులాడేవారు, సోవియట్ రచయితలనూ, అభ్యుదయ రచయితలనూ పాక్షిక ధోరణి కలవారని ( Tendentious ) నిందించుతారు. ఫ్రెంచి శబ్దకోశంలో "Tendentious" టెండన్షస్ అనే పదానికి "ఒక విషయంపట్ల మొగ్గుట" అని అర్థం. అందుచే అందరి ప్రజల లాగానే రచయితకూడా కొన్నింటిని ప్రేమించడం, కొన్నింటిని ద్వేషించడం సహజమే. తమ సమకాలికులతో రచయిత విభే ధించుతున్నాడంటే అతని భావాలు (Feelings) సునిశితంగా వుండడంవల్ల నేగాని మొగ్గు చూపటంవల్ల కాదు. రచయిత న్యాయంవైపు, హేతువాదంవైపు, సౌభ్రాతృత్వంవైపు మొగ్గ వచ్చు. లేక అతడు సామాజిక అసమానతవైపు, అజ్ఞానం వైపు, జాతీయ దురహంకారంవైపు, మొగ్గవచ్చు. ఆ విధంగా అతడు గర్వపోతుదనంవైపు, మతంవైపు, దేశంపై సంకుచిత దురభిమానంవైపు అతడు మొగ్గుదల చూపవచ్చు.

గత శతాబ్దంలోని రష్యన్ మహారచయితలు, ఇప్పుడు "పాక్షికధోరణి" అనే పిలువబడే ఉద్వేగానికి ( passion ) భయపడేవారుగాదు.

డాంటే తన సమకాలికుల ఆత్రుతను పంచుకొన్నాడు. తనకాలంనాటి రాజకీయ పోరాటాలలో పాల్గొన్నాడు. తన

గేయాలను చాలావాటిని ఆ రాజకీయపోరాటాలకు అంకితం చేశాడు. పాక్షికధోరణి 'డివైన్‌కామెడీ'ని సృష్టించుటలో తోడ్పడింది కాని అడ్డుకొగలలేదు. 13 వ శతాబ్దంనాటి దుష్ట శక్తుల విజృంభణ యీనాడు గతచరిత్రగా కన్పించినా, ఈనాటికీ ఆ రచన మనల్ని కదిపివేస్తుంది.

నెపోలియన్ సైనికులు స్పానిష్ గెరిల్లాలను ఉరితీసిన దృశ్యాన్ని గోయా చిత్రించాడు. ఇదీ పాక్షికధోరణి కలదే. అయినా ప్రపంచ ఉత్తమ చిత్రకళా ఖండాలలో ఇదీ ఒకటి. తర్వాత 70 ఏండ్లకు ప్రముఖ ఫ్రెంచి చిత్రకారుడు ఎడ్వర్డ్ మానెట్ మరొకచిత్రం గీశాడు. చక్రవర్తి మాక్జిమిలియన్‌ను మెక్సికన్ తిరుగుబాటుదారులు ఉరితీసిన దృశ్యం అది. రాజకీయ భావప్రేరేపణతో ఈ చిత్రంగీశాడో, లేక స్పానిష్ చిత్రాన్ని ప్రేమించినందువల్ల యీ చిత్రాన్నిగీశాడో మనకు తెలియదు.

అద్భుత ప్రవీణుడుగా అతని కళాశక్తి అంతా దానిలో ఉన్నప్పటికీ ఆ చిత్రం మనల్ని కదల్చదు. తన కాన్వాస్‌లో గోయా పాక్షికధోరణి అవలంబించాడు. విదేశ సైనికులను అతడు ద్వేషించాడు. గెరిల్లాల ధైర్యసాహసాలను మెచ్చు కొన్నాడు. కాని మానెట్ అభిప్రాయాలు మనకు స్పష్టంగా తెలియవు. అతడు తిరుగుబాటుదారులకు సానుభూతి చూపెడు తున్నాడో, మాక్జిమిలియన్‌స్థితికి జాలిపడ్డాడో మనకు బోధ పడదు. తన వైఖరి ఏమిటో వ్యక్తపరచకుండా అతడు ఆఘట నను చిత్రించాడు. అందుచేతనే ఆ కాన్వాస్ అంత నిర్జీవంగా ఉండటానికి కారణం.

పాశ్చాత్య కథోరణిని వ్యతిరేకించుతూ, "కళ కళకోసమే"నని తన యౌవ్వనదశలో బ్రైయుసావ్ ప్రచారంచేశాడు. "స్వప్నాలన్నీ నాకు సన్నిహితమైనవే. పలుకులన్నీ నాకు ప్రియతమమైనవే; నాగేయాన్ని దేవుళ్ళందరికీ అంకితంఇస్తాను."అనేవాడు.

"రోడ్స్ అండ్ క్రాస్‌రోడ్స్" అనే గ్రంథ రచయిత అయిన బ్రైయుసావ్ పాఠకుని కదల్చలేకపోయాడు. అతడు కవి అవునా కాదా అని విమర్శకులు చర్చించారు. కవితా నైపుణ్యాం అతనికి లేదని చాలామంది వాదించారు. పాఠకులు తమ జీవితకాలమంతా ఏ కవులను గురించి జ్ఞాపకం పెట్టుకుంటారో ఆ కవులలో వుండే కవితా ప్రతిభ బ్రైయుసావ్ కూడా కలిగియున్నాడని నా అభిప్రాయం. అయితే విప్లవానికి పూర్వపు బ్రైయుసావ్ అంటే పాఠకులు నిర్లక్ష్యంగా ఉంటానికి కారణం కనుగొనడం సులభమే. అతడు జీవితంపట్ల నిర్లక్ష్యంగా వుండేవాడు. అయితే ఈ నిర్లక్ష్యం అతని స్వభావతః వచ్చిందికాదు. కళ అంటే అతనికి గల అవగాహనలో ఇది ఇమిడివుంది. అందరి దేవుళ్ళకూ మొక్కేవాడికి ఏ దేవుడిలోనూ నమ్మకం ఉండదు. అలాగే అందరిస్త్రీలనూ ప్రేమించుతానని చెప్పుకునే మనిషి ఏ స్త్రీనీ ప్రేమించడు.

1812 నాటియుద్ధాన్ని వర్ణించినపుడు టాల్‌స్టాయ్ సానుభూతి ఎలావుండేదో స్పష్టంకాదా? "A Sportsman's Sketches" (ఆటగాని జీవిత చిత్రాలు) అనే గ్రంథ రచయిత దేనిని ద్వేషించుతున్నాడో, ప్రేమించుతున్నాడో తెలియడం కష్టమా? రష్యన్ ప్రజలకూ – బుద్ధిహీనులూ, చిత్తశుద్ధి లేనివాళ్లూ, మొండివాళ్ళూ అయిన రష్యన్ ఉన్నత వర్గా

లకూ – మధ్య జరిగే పోరాటంలో సాల్టికోవ్– ష్చెడ్రిన్ తటస్థంగావుండాలని తలచాడా ?

"As simple as Mooing" (యాజ్ సింపుల్ యాజ్ మూయింగ్) అనే పుస్తకం మొదలు తాను మరణించే ముందు వ్రాసిన గేయాలవరకు మయకోవస్కీ రచనలన్నీ "పాక్షిక" మైనవే. ఈ మహాకవి రచనల గురించి ఇటీవలనే చర్చ జరిగింది. నిజానికి చర్చ వివరాలను చదివేటప్పటికి నే నాశ్చర్య పడ్డాను. మయకోవస్కీలాగా కవులంతా వ్రాయాలని ఒక ఉపన్యాసకుడు సలహా ఇచ్చాడు. (నెక్రసోవ్‌కు వారసుడవడం కంటె, మయకోవస్కీకి వారసుడవడం అనే భావం కొత్తదిగానీ, సాహసోపేతమైనదిగానీ కాదని నా అభిప్రాయం.)

"మయకోవస్కీ ఎలా వ్రాశాడన్నది కాదు ముఖ్యం; అతడు ఏమి వ్రాశాడన్నది ముఖ్యం"అంటూ మరికొందరు వాదించారు. మయకోవస్కీ అసలు ఆయన (మయకోవస్కీ) వ్రాసినట్లే వ్రాయలేదని రుజువుచేయడానికి కొందరు ప్రయత్నించారు. నూతనమైన ఇతివృత్తానికి తగిన నూతన రీతులను మయకోవస్కీ సృష్టించాడు. అతడు మొదట్లో వ్రాసిన గ్రంథాలకు తర్వాత రచనలకూ పూర్తి సంబంధంవుంది. బస్ల్యాక్‌కు "ఫ్యూచరిజం" ఒక కళాధోరణి; మయకోవస్కీకి అది తాను ద్వేషించిన సమాజ నీతులను, తత్వశాస్త్రాన్నీ, కళలనూ దెబ్బగొట్టేందుకు ఆయుధం. ఈ ఆయుధం ఎంత వరకు ఉపయోగపడుతుందనే విషయంలో సందేహం ఉండవచ్చు. కాని ఎప్పుడూ మహోన్నతమూ, ఉద్రిక్తమూ అయిన

మయకోవస్కీ హృదయంగురించి ఎవరికీ ఎలాంటి సందేహమూ లేదు.

" రచయిత వినోదంకోసం, పేరు ప్రతిష్ఠలకోసం వ్రాయడు. ప్రజలను బాగుచేయాలని, జీవితాన్ని మరింత ఉన్నతపథాలకు నడపాలని రచయిత భావించుతాడు. ఈ పోరాటంలో పుస్తకాలను ఒక నైతిక ఆయుధంగా అతడు ఎంచుతున్నాడు.

రచయిత తన నవలలోని రంగస్థలం మీాదికి వచ్చి ఎప్పుడూ పాఠకులికి తన పాత్రల పట్ల తన వైఖరిని గాని, తాను వర్ణించే ఘటనలపట్ల తన వైఖరిని గాని చెప్పుకోవలసిన పనిలేదని నా అభిప్రాయం. ఒక నవలలోని పాక్షిక ధోరణి (Tendentiousness) కి మూలం దానిలోని ఉద్వేగం (Passion) అని నా అభిప్రాయం. ఉన్నత ఆశయాలతో ప్రేరితుడైన రచయిత, సామాజిక అభివృద్ధిని అర్థంచేసుకొన్న రచయిత తాను సృజించిన పాత్రలలో కొన్నిటికి జీవమూ, న్యాయమూ వుండటం, మరికొన్ని పాత్రలలో అన్యాయమూ, తప్పనిసరియైన పతనమూ వుండటం, గమనించుతాడు.

రచయితలోని ఉద్వేగం (Passion) అంటే నిర్వ్యాజమైన నిస్సహాయ పాక్షికత్వం అని అర్థంకాదు. దురాశను, కపట నాటకాన్ని, వంచననూ రచయిత ద్వేషించవచ్చు. కాని పిసినిగొట్టువానికీ, కపటికీ, వంచకునికీ మానవ నైజాలుంటాయనేది అతడు మరువలేడు. ప్రపంచాన్ని రెండు రంగుల్లోనే – నలుపు తెలుపుల్లోనే – (మంచి, చెడ్డ) చిత్రించరాదు. ప్రేమలాగానే ద్వేషంకూడా సజీవ ప్రజలకు, వాస్తవ

ప్రజలకు సంబంధించిన విషయం. ఏనో అస్పష్టభావాలకు సంబంధించిన విషయంకాదు.

చారిత్రిక క్రమగతుల అవగాహన, మానవజాతి భవిష్యత్తునుగురించి స్పష్టమైన అభిప్రాయమూ, అభ్యుదయ రచయితను సంకుచిత పరచక విశాల దృష్టిని కల్గించుతాయి. రాబర్ట్ మెర్లీ అనే అతను వ్రాసిన "మరణం నా వర్తకం" (Death is my trade) అనే నవల ఇటీవలనే ఫ్రాన్స్‌నుండి వెలువడింది. ఒక మృత్యు శిబిరానికి కమాండర్‌గా పనిచేసిన ఫాసిస్ట్ కథను ఈ రచయిత తెలియజేస్తాడు. ఈ పుస్తకం రచన బాగానేవుంది, మంచి నైపుణ్యమూ కన్పడుతుంది. కాని ఆ ఫాసిస్టుకూడా జీవించివున్న ఒక మానవమాత్రుడనే విషయాన్ని రచయిత కొన్నిసార్లు స్ఫురింపచేయ లేకపోయాడు. నవల పూర్తి అయేసరికి అతనిని రాక్షసునికి మారురూపమైన పరిహాసచిత్రం (కేరికేచర్)గా చిత్రించాడు. ఇది పాక్షిక ధోరణి (టెండెన్షస్ నెస్)వల్ల లోపంకాదు. చారిత్రిక క్రమాన్ని అర్థంచేసుకొనకపోవడమే. ఫాసిజాన్ని రచయిత ఒకప్రక్క ద్వేషించుతున్నా, అందుకుగల సామాజికమూలాలేమిటో చూడటంలేదు. అందుచే దానిని ఎదిరించడానికికూడా అతనివద్ద ఏమీ లేదు.

జర్మన్ కమ్యూనిస్టు అన్నా సేఘర్స్ వ్రాసిన "The Dead stay young" (చనిపోయిన వారింకా యువకులే) అన్న నవలలో ఫాసిస్టులు నెత్తురూ, కండలూ వున్న సజీవ పాత్రలు. వాళ్ళల్లో కొందరికి కొన్ని మంచిగుణాలు లేకపో లేదు. కాని వారంతా భయంకరమైన నేరాలు చేస్తారు. లేదా

ఆ నేరాలను కప్పిపుచ్చుతారు. పాత్రికథోరణి, అన్నా సేఘర్స్‌కు గాఢంగా చూడటానికి అవకాశమిచ్చింది. ఆమె చక్కని వాస్తవికచిత్రాన్ని కళాత్మకంగా రచించడానికి సహాయపడింది.

"బీళ్లు దున్నేరు" (The Soil-upturned) అనే గ్రంథంలో షోలకోవ్ పాత్రికథోరణిని కనపరచాడు. ఎందువల్ల నంటే రైతాంగంలో వచ్చిన కష్టమైన మార్పు అభ్యుదయానికి ఒకమెట్టు అని అతనికి తెలుసు. ఈ పాత్రికథోరణి కులక్‌ల ఆత్మలోకి చొచ్చుకుపోడానికి షోలకోవ్‌కు సహాయపడింది. అందుచేతనే అతడు ఘటనలను నిర్జీవంగా పోస్టర్‌లాంటి బొమ్మలలాగా చిత్రించలేదు. మనస్తత్వ సత్యంతో నిండిన చిత్రాన్ని చిత్రించగల్గాడు.

ఉద్వేగం (Passion) లేనిదే నిజమైన కళ లేదనీ, ఉండబోదనీ నానమ్మకం. ఆత్మపరమైన నిరుత్సాహాన్ని పోగొట్టడం కంటే శైలిలోని దోషాలను, నిర్మాణంలోని బలహీనతలను, ఇతర సాహిత్యలోపాలను పోగొట్టుకోనడం సులభమే. ఈమధ్య అసలు వాడని కొన్ని పదాలను జ్ఞప్తికి తెచ్చుకోడం అవసరం. ప్రబోధం (Calling) ప్రేరణ (Inspiration) సేవ (Service) మొదలయిన పదాలవి. ఈపదాలు నిజంగా హాస్యాస్పదమైనవి గానీ, డుల్లపదాలుగానీ కావు. రచయితయొక్క విధ్యుక్త ధర్మాల్ని నిజంగా అర్థంచేసుకొనడానికి ఉపయోగపడే పదాలివి. తనకున్న కొద్దిపాటి జీవితంలో రచయిత అనేక జీవితాలను జీవించాలి. ప్రజల హృదయాలలో ఉత్సాహం రేకెత్తించాలి. అలా చేయడానికిగాను మానవుని ఆంతరంగిక ప్రపంచంలో వెలుగును ప్రసారించి, పాఠకుడు దానిని మరింత స్పష్టంగా

చూడడానికీ, సమగ్రంగానూ, సగర్వంగానూ జీవించడానికీ అతనికి రచయిత తోడ్పడాలి.

# 6

ఒకానొక రచయితను ప్రశంసించేటప్పుడు అతనికి 'చాతుర్యం' వుందంటాము. ఇంకా కొంచెం స్పష్టతగా చెప్పాలంటే "సామర్థ్యం" వుందంటాం. ఈ మాటలకు సరిగ్గా అర్థం ఏమిటో కనుక్కోడానికి మీరు ప్రయత్నించితే, "అతను బాగా వ్రాస్తాడు." అనో లేదా "కాలక్షేపం బాగా సాగిస్తాడు" అనో, "అతనికి అభిరుచిని కల్గించే అభిప్రాయాలు" ఉన్నవనో, "అతడు బాగా ప్రపంచాన్ని పరిశీలించేవాడు" అనో సమాధానం వస్తుంది.

కొందరు పదజాలం అంటే పడిచస్తారు. మరికొందరు సంగీతానికి, చిత్రకళకు పడిచస్తారు. కవిమాట అలావుంచి కథారచయితగాని, నవలా రచయితగాని మామూలు వార్తా పత్రికలలోని సంకుచితపదజాలంతో తృప్తిపడి పదాలను నిర్లక్ష్యంచేయడు. రచయిత శిల్పం భావవిషయంలో అతని ఆవేదనతో సన్నిహితంగా కట్టుబడివుంటుంది. నిరంతరం కష్టపడి పనిచేయడంవల్లనే అతని పనితనం అభివృద్ధిచెందుతుంది. రచయితకు మంచి శైలి, పనితనం వుండవచ్చు. కాని అతడు పాఠకుని హృదయాన్నీ, మనస్సునూ కదపలేకపోవచ్చు. హ్యూగో, బొడలైర్, వెర్లైన్, ర్యాంబొద్ మొదలైనవారు ఫ్రాన్స్ హృదయంలో ఇంకా జీవించివున్నారు. కాని పార్నా

సియన్స్ (19 వ శతాబ్దపు ఫ్రెంచి కవుల) రచనలను ఎవరు చదవగలరు? లెస్కావ్ నైపుణ్యాన్గురించి నాకు మంచి అభిప్రాయమే వుంది. కాని ఆ ప్రముఖ రచయిత తన పాఠకుల హృదయాలను ఆటే కదల్చలేకపోయాడు,

నవలారచనాకౌశల్యం మాత్రమేగాక, ఆ నవలను పాఠకులు ఆసక్తితో చదివేట్టు దాని సంవిధానం వుండాలి. రచయిత కౌశల్యం అంటే మాటలకోసం ఆవేదనేగాదు. కల్పనాశక్తికూడా వుండాలి. సృజనకు కల్పనాశక్తి పునాది అని వేరే చెప్పనక్కరలేదు. నూతన భౌతిక, ఆధ్యాత్మిక విలువలను సృష్టించే ప్రతివానికీ - అతడు భౌతికశాస్త్రవేత్తగానీ, శిల్పిగానీ, రాజకీయవేత్తగానీ - అవసరం. నవలలోని ప్లాట్ ఒక్కటే పాఠకులను ఆకర్షించదు. 19 వ శతాబ్దంలో రష్యన్ సాహిత్యం (డాస్టొవస్కీ మినహా) తంత్రాలతో కూడిన ప్లాట్‌ను నిరసించింది. 19 వ శతాబ్దపు రష్యన్ సాహిత్యం యథార్థపూర్వక సాహిత్యం గనుక, డ్రామటిక్ (ఆకస్మిక విస్మయ) ఘటనలు మరీ యెక్కువ వుండట్టం అసంబద్ధమని తలచింది. ఎందుచేతనంటే యిలాంటి ఘటనలు జీవితంలో యెక్కువగా వున్నప్పటికీ, కళాత్మకంగా రచించవలసి వచ్చేటప్పటికి కృత్రిమంగా తయారవుతాయేమోనని అది భయపడింది. ఉద్రిక్తపరచే ప్లాట్ లేనంత మాత్రాన తుర్గెనివ్, చెకోవ్ కథలు మన అభిరుచిని తగ్గించాయా? విషమఘట్టాలను పెంపొందించడంకన్న ఇంకా అవసరమైనది మరొకటి రచనకు వున్నది. మంచి కల్పనాశక్తి రచయితలకు వుండడం మంచిదే. కాని అది వొక్కటే చాలదు. మంచి తెలివితేటలతో వ్రాసినవీ, కాలక్షేపం కల్గిం

చేసే చాలా పుస్తకాలు వుంటాయి. వాటిని త్వరగా చదవ వచ్చు. గబగబా "మింగేయ" వచ్చు. కాని వాటిని త్వర లోనే మరచిపోతారు పాఠకులు. వాటిలో గాఢత లేదుకాబట్టి పాఠకుడు వాటిని వూరికే అలా త్రిప్పివేస్తాడు.

చరిత్రక్రమాన్ని అవగాహనచేసుకొనే సామర్థ్యం కల్గి యుండటం రచయిత ప్రతిభకు అత్యంతావసరం. వీధిమానిసి కంటె ఎక్కువ బుద్ధి జ్ఞానాలు లేని రచయితను మనం ఊహిం చడం కష్టం. తాను. జీవించుతున్న కాలాన్ని అర్థం చేసుకొని చరిత్ర అనే పర్వతశిఖరాగ్రంనుంచి అవలోకించడం, పూర్వం వలె, అన్ని వేళలా రచయితల ప్రత్యేకలక్షణంకాదు. కళావేత్త బ్లాక్లాక్ కూ, రాజకీయవేత్త బ్లాక్లాక్ కూ పరస్పర వైరుధ్యం వుంది. మానవుల హృదయాల్నీ, మనస్సుల్నీ లోతుగా తరచి చూడగల అపారజ్ఞానంగల టాల్ స్టాయ్ రాజకీయాలలో సాధారణ, సామాజిక తత్వవేత్తగానే వుండిపోయాడు. సామాజి కాభివృద్ధి మార్గాలనుగురించి ఆధునిక రచయితకు నేడు ఎక్కువ తెలుసు.

అద్భుతమైన ఊహాగానంతో నిండిన హెచ్చరికలమీద గాని, వివాదాస్పదమైన ఊహలమీదగాని అత డాధారపడ వలసినపనిలేదు. తన ఉనికిని అత్యద్భుతంగా నిరూపించుకొన్న శాస్త్రీయ సిద్ధాంతం ఒకటి అతని కళ్ళముందు వుంది. మార్క్సిస్టు పరిశీలన ప్రాముఖ్యతను అర్థంచేసుకొనని పాశ్చాత్య రచయితలు, మవతరంలోని విషమఘట్టాలలో ప్రజలతో సంబంధంలేకుండా అడుగుజారి కూర్చున్నారు. స్వల్పవిషయా లను ప్రశంసిస్తూ వ్రాయడమో, లేక ప్రపంచంలో ఉన్న

దాన్నంతా తిరస్కరించుతూ వ్రాయడమో తప్ప వాళ్ళ రచనల్లో ఏమీలేదు. ఇప్పుడు జరుగుతున్న దేమిటో అర్థంచేసుకోవడం ఒక్కటే చాలదు. గతకాలంలోని తాత్వికవేత్తలు నిర్లక్ష్యంగా వ్రాసిన నవలలు కొన్నివున్నాయి. వారి పుస్తకాలలోని పాత్రలకు పేర్లు, ప్రత్యేకలక్షణాలు, వృత్తులు మొదలైనవి వుంటాయి. అయినా వాళ్ళు సజీవప్రజలు కారు. యథార్థతను లేక భ్రాంతిని చూచాయగా వర్ణించే చిత్రాలు (స్కెచెస్) మాత్రమే.

రచయితకు ఎక్కువ పరిశీలనాశక్తు లున్నాయనే అంశం యింకొకటి వుంది. 'పరిశీలన' (Observation) అన్న పదానికి శబ్దకోశార్థం చూస్తే, "ఇతరుల దృష్టినుండి తప్పించుకుపోయిన దృక్ప్రపంచ వివరాలను, విశేషాలను అవలోకించే శక్తి" అని వుంటుంది. సహజంగానే రచయిత వివరాలను గమనించే శక్తి గల్గియుండాలి. ప్రతిదానినీ అతడు వర్ణించలేనిమాట నిజమే. వివరాలు తెలిసివుండటంవల్ల అతడు తాను సృజించే పాత్రలను, వాటి పరిసరాలను, జీవితాన్ని విస్పష్టంగా చిత్రించగలడు.

టాల్‌స్టాయ్ నవలలోని పాత్రల వర్ణనలకు ముగ్ధుడు కానివా డెవ్వడు? నిశిత పరిశీలనచేసి, మంచి నైపుణ్యంతో యెన్నుకున్న వివరాలే ఆ వర్ణనలు. ఇతరుల దృష్టినుండి తప్పించుకొన్న వివరాల పరంపరలను నమోదు చేయడంవరకే రచయిత పరిమితమై వుండాలని అనను. ఒకవ్యక్తి ప్రవర్తనను నిర్ణయించే మానసికపరిస్థితిని రచయిత చూస్తాడనడం సరియైనదే. ఇతరులు ఆవ్యక్తిలో గమనించనిదీ, ఆవ్యక్తియే అసలు ఒకానొకప్పుడు గ్రహించని విషయాలను రచయిత గమనించుతాడు.

ఇది నవలారచయితలు సజీవపాత్రలను సృష్టించడానికి తోడ్పడు తుంది. అలాంటి పాత్రలతో పుస్తకాలు వ్రాసి ప్రజలకు అతడు అందించగలడు.

వార్తాపత్రికకు చెందిన ఫోటోగ్రాఫర్ కూడా పరిశీలకుడు కావచ్చు. అతడుకూడా చిత్రమైన వివరాలను విలక్షణమైన ముఖాలను, దుస్తులను, ప్రకృతి దృశ్యాలను పరిశీలించవచ్చు. రెంబ్రాంట్ కూడా పరిశీలకుడే. అయితే అతని పరిశీలన మరో విధమైనది. అతడు చిత్రించిన చిత్రాలనుచూస్తే, అతడు తన చిత్రాలకు నమూనాలగా తీసుకున్న వ్యక్తుల జుట్టు, చర్మం, ఆకృతి, బట్టలు వగైరా మాత్రమేగాక, వారి హృదయాల్లోకి కూడా చూడగల్గాడు. అలాంటి పరిశీలనాశక్తులను కళాకారుడు కల్గియుండాలి. మానవుల అంతర్యాన్ని చూడగల్గడమే, రచ యిత నిపుణతలోని ముఖ్యస్వభావం.

## 7

ప్రజలంటే అభిరుచి, ప్రేమ, ఇతరుల నుండి గ్రహించే స్వభావం మొదలైనవి రచయిత స్వాభావిక లక్షణాలు. కాని ఎలాంటి వ్యక్తినైనా అతడు అర్థంచేసుకో గలడని అనుకోడం అమాయకత్వం అవుతుంది. ప్రజలంతా —రచయితలతోసహా — తమ అనుభవ పరిమితలోనే యితరుల మనోవికారాలను (Emotions) అర్థం చేసుకోగలరు. రచ యితకు దూరమైన మనోభావం రచయిత మనస్తత్వ నిర్మా ణానికి భిన్నమైన భావం, సహజంగానే అతని దృష్టినుండి

తప్పించుకుపోతుంది. ఒకవేళ అతడు చిత్రించినా, యితర గ్రంథాలలో అది ఎట్లా వర్ణింపబడిందో అతడు గుర్తుతెచ్చుకోవాలి. లేదా సహేతుకమైన ఊహాయింపులతో అతడు సంతృప్తిపడాలి. ఇలాంటి పుస్తకాలుగాని, ఇలాంటి వర్ణనలు గల నవలలో కొన్ని భాగాలుకాని పేలవంగా అభిప్రాయ వ్యక్తీకరణ లేకుండా వుంటాయి.

పాశ్చాత్య రాజ్యాలలో ప్రబలియున్న అభిప్రాయం ప్రకారం రచయిత జీవితనాటకంయొక్క, కామెడీయొక్క ప్రేక్షకుడు మాత్రమే. కాని యీ అభిప్రాయం తప్పు. అతడు ప్రేక్షకుడు మాత్రమేగాదు. అత డా జీవితనాటకంలో పాత్ర వహించితీరాలి. ఒక నవల ప్రథమాధ్యాయం ప్రారంభించే ముందు, నెలలకొలది, సంవత్సరాలకొలది సన్నాహం చేయాలి. నోట్సు, మొదటి ప్లానులు వగైరా సిద్ధంచేసుకోవాలి. ఇతర ప్రజలతో గాఢమైన పరిచయం, వారి సుఖదుఃఖాలలో పాల్గొనడం, ఉత్సాహ నిరుత్సాహాలలో భాగస్వామికావడం, యితర ప్రజలతో సన్నిహిత సంబంధం మొదలైనవి వుండాలి.

ఇలా చెప్పడంలో రచయిత తాను అనుభవించింది మాత్రమే చిత్రించుతాడని నా అభిప్రాయంకాదు. రచయిత తాను అనుభవించిన దానినేగాక, పరిశీలించిన దానినికూడా మార్చుతాడు. అయినా, రచయిత తాను అర్థంచేసుకోగల ప్రజల ఆలోచనను, మనోవికారాలను (Emotions) యెప్పుడూ వర్ణించుతాడు. తన రచనలోని పాత్రలు యెలా నడుస్తాయో అర్థంచేసుకోడానికి ఆపాత్రల స్వభావాన్ని తనకు వెల్లడించే అనుభవాన్ని రచయిత పొందాలి.

రణరంగంలో కంకాళాలలో ఉండి, పీనుగుపెంటలలో ఉండి, పాశ్చాత్య రచయితలు మొదటి ప్రపంచయుద్ధాన్ని వర్ణించారు. అంతేగాని తమ అధ్యయన గృహాలనుండి వ్రాయలేదు. బార్బ్యు రెమార్క్యు, రెన్, డార్జెల్స్, హెమింగ్వే, ఆల్డింగ్టన్ మొదలైన రచయితలంతా ఈ కోవకు చెందినవారే. బుద్ధిమాలిన హత్యాకాండకు క్రోధావేశులయిన దేశాల అంతరాత్మను, విషాదకరమైన, విచిత్రాంశాలతో కూడిన తమ నవలలో వీరు చిత్రించారు. నెక్రసోవ్, కజకెవిచ్, బెక్, సిమనోవ్, గ్రాస్మన్, పనోవా మొదలైన సోవియట్ రచయితలు తమ రచనల్లో రెండవ ప్రపంచయుద్ధాన్ని బాగా చిత్రించారు. వీరంతా యుద్ధంలో పాల్గొన్నవారే.

"యుద్ధమూ, శాంతి" (War & Peace) చారిత్రక నవల. టాల్‌స్టాయ్ తాను పుట్టకముందు జరిగిన ఘటనల గురించి యిందులో వర్ణించాడు. ఆ ఘటనలగురించి ఆయన పాత చారిత్రకపత్రాలను పరిశీలించవలసివచ్చింది. వాటిలో గత యుద్ధాన్ని గురించిన రిపోర్టులను ఆయన తెలుసుకోగలిగాడు. కాని ఆ యుద్ధాల్లో పాల్గొన్న సైనికులు, ఉద్యోగులు ఆ యుద్ధంగురించి ఏమనుకొన్నారో వాటిలో వుండదు. సెవాస్తపూల్ రక్షణలో టాల్‌స్టాయ్ పాల్గొన్నాడు. క్రిమియా యుద్ధం 1812 నాటి యుద్ధంవంటిది కాదని వేరే చెప్పనక్కరలేదు. తన అనుభవాలను, పరిశీలనలను యీ నవలలోకి మెకానికల్‌గా అనువర్తింపచేయలేదు. కాని సెవాస్తపూల్ రక్షణలో టాల్‌స్టాయి పాల్గొనడం "యుద్ధమూ, శాంతీ" అనే అతని నవలలోని పాత్రలను అర్థంచేసుకోడానికి ఆయనకు ఉపయోగ

పడింది. యుద్ధంలో యెప్పుడూ పాల్గొననివ్యక్తి, సైనికుని జీవితాలను, అతడు యెలా భయాన్ని జయిస్తాడో, యెప్పుడూ నోరు తెరచుకొనివున్న మృత్యుదేవతతోపాటు అత డెలా జీవించుతున్నాడో, స్నేహాలు యెలా పెంపొందుతాయో, ఒకప్రక్క మొరటుతనం, మరొకప్రక్క ప్రతిదానికీ బాధపడే ఆర్ద్రహృదయం వొకేసారి మానవులలో యెలా వుంటుందో, అర్థంచేసుకోలేడు. ప్రజలను వర్ణించడానికిముందు వారి హృదయకవాటాలకు తాళం నీవద్ద వుండాలి. ఇతరుల అనుభవాలను తా ననుభవించగల శక్తినే రచయిత పరిశీలనాశక్తి అని అనవచ్చు.

ప్రతిభావంతమై కళ్ళకుగట్టే మొదటి పుస్తకం వెలువడగానే ఒక యువరచయిత తార శాశ్వతంగా రాలిపోయిన ఉదాహరణలు మనం చాలా చూశాము. కొన్ని సందర్భాలలో రెండవ పుస్తకమే వెలువడదు. మరికొన్ని సందర్భాలలో ఆ రచయితల రెండవ, మూడవ పుస్తకాలుకూడా వెలువడుతాయి. కాని పాఠకులు ఆ రచనలను చూచిన తర్వాత వారికున్న భ్రమలు కాస్తా పోతాయి.

సాధారణంగా అలాంటి విషాదసంఘటన రచయిత జీవితచరిత్రతో సంబంధించి వుంటుంది.

ఇంజనీర్ గానో, భూగర్భ శాస్త్రజ్ఞుడుగానో, కార్మికుడుగానో, విద్యార్థిగానో జీవితంలో ఉత్సాహవంతమైన పాత్ర వహించిన యువకునికి కొంత అనుభవంవుంటుంది. ఏదో కొంత చూసివుంటాడు. అతనికే కొంత చాతుర్యం వుంటే, తన అనుభవాన్ని తన రచనలో ఉపయోగించి విజయం

పొందుతాడు. అతడు రచన వృత్తిగా సాగించడం మొదలు పెట్టగానే, తా నిదివరలో సాగించిన జీవితానికి దూరమై పోతాడు. తాజా పరిశీలనానుభవవేగం ఆగిపోతుంటి. అతని రెండవ లేక మూడవ రచనలు ఎందుకు విఫలం చెందుతా యంటే, అవి అనుభవంమీద ఆధారపడి రచించినవికావు; సాహిత్య అనుభవాల స్మరణలూ, రెడీమేడ్ పథకాలూ, ఊహా యింపులతోను కూడుకొని వుంటాయి.

గతకాలంలోని రచయితల జీవితమార్గాలు యెంత క్లిష్టమైనవో, ఎంత కంటకావృతమైనవో జ్ఞాపకం వుంచుకోండి. అనేక నగరాలలో సాల్టికోవ్-ష్చెడ్రిన్ సివిల్ సర్వీసులో ఉద్యోగాలు చేశాడు. డోస్టవస్కీ కఠినశిక్ష అనుభవించాడు. గోర్కీ "విశ్వవిద్యాలయాలు" అనే గ్రంథంలో తెల్పిన జీవిత యాత్రను చూడండి. కోరొలెంకో (చెప్పులు కుట్టేవాడు, చిత్రకారుడు) ప్రవాసం గమనించండి. ఈ రచయిత లంతా ప్రతిఒక్కరూ ఒక డజన్ గ్రంథాలు వ్రాయగల భావనా సంపత్తును అనుభవంలో సంపాదించారు.

పెట్టుబడిదారీ ప్రపంచంలో రచనద్వారా పొట్టబోసు కోడం చాలా కష్టమైనపని. రచనయే వృత్తిగాగల గ్రంథ కర్తలుగా అయేముందు యూరప్‌లోని, అమెరికాలోని సుప్ర సిద్ధ రచయితలు చాలామంది, అంతకుపూర్వం కార్మికులుగా, పోస్టుజవానులుగా, పడవకూలీలుగా, వీధి ఫోటోగ్రాఫర్లుగా, మంగలివాళ్లుగా, బంగారం సంపాదించాలని అన్వేషణకు బయలుదేరినవాళ్లుగా పనిచేశారు. వారికి చాలామంది ప్రజలతో సంబంధం ఏర్పడింది. వారెన్నో కఠినపరీక్షలకు లోనయ్యారు.

పెట్టుబడిదారీ సమాజంలోని అధమావస్థను గురించి నవలలు వ్రాయడంలో వారి కా జీవితం ఎంతో తోడ్పడింది.

"పట్టణాలు - సంవత్సరాలు" (Cities and Years) అనే గ్రంథాన్ని, తాను మొదటి ప్రపంచయుద్ధంలో జర్మనీలో యుద్ధ ఖైదీగా ఉన్నందున ఫెడిన్ వ్రాశాడు. అతని ఆఖరి రెండు నవలలు అతని యౌవనకాలానికి సంబంధించినవి. "దళం" (The Ninteen) అనే గ్రంథం వ్రాసేముందు ఫెడయెవ్ సోవియట్ దూరప్రాచ్యంలో గెరిల్లాయోధుడు. అంతర్యు ద్ధాన్ని గురించి వ్రాసిన కథలలో, వ్సెవొలోడ్ ఇవనోవ్, అంత ర్యుద్ధంలోని తన అనుభవాలను వర్ణించాడు. అలెక్సిటాల్‌స్టాయ్ త్రికగ్రంథం (Trilogy) లో ఎక్కువ భాగం ఆత్మకథయే. (A White Sail Gleames) ("తెల్ల తెరచాప మెరుస్తోంది") అనే నవలలో, తన బాల్యదశలోని దృశ్యాలను వర్ణించు తాడు. "సౌఖ్యం" (Happiness) అనే నవలా ప్రారంభం పావ్‌లెంకో అంతసులభంగా చేయలేదు. దానిని వ్రాసేముందు అతడు స్వయంగా అనుభవించిన ఘటనలు ఎన్నో ఉన్నాయి.

ఒక నవల అచ్చయినతర్వాత దానికి వచ్చే ఆదరణను పరిశీలించితే, "ఇతరుల అనుభవాన్ని రచయిత అనుభవించడం" అని నేను దానినిఅన్నాను. ఆ విలక్షణ స్వభావాన్ని గ్రహిం చడం సులభం. అనగా పాత్రలను ఎన్నుకోడంఅనే విలక్షణ స్వభావాన్ని గ్రహించడం సులభం. కొన్నికొన్ని పాత్రలను, ఒక్కొక్క పాఠకుడు బాగా మెచ్చుకుంటాడు. ఒక నవలలోని పాత్రల విషయమై తమనైఖరిలో విభేదం రావడంవల్ల తరచు పాఠకుల్లో తీవ్ర వాగ్వివాదాలు జరుగుతాయి. నేను చెప్పేది

సిద్ధాంతవిభేదాల విషయం కాదు. పాత్రల అవగాహన విష యంలో వచ్చే విభేదాలనే. స్టెంధాల్ వ్రాసిన గ్రంథం ("Le Rouge et le Noir") వెలువడగానే, కొందరు పాఠ కులు జూలియన్ సొరెల్‌ను అచ్చగా మంచి రొమాంటిక్ వ్యక్తి అన్నారు. ఇతరులు అతనిని కటికిగుండెవాడనీ, స్వార్థ పరుడనీ, నీచుడనీ, ఉన్నతపదవులకు ఎగబ్రాకడానికి తంటాలు పడేవాడనీ అన్నారు. పనోవా వ్రాసిన నవల "క్రుజిలిఖా" పై ఇటీవలనే జరిగిన చర్చను మరచిపోలేం. లిస్టోపాడ్ పాత్రను, చర్యలను పాఠకులు విభిన్న దృక్కోణాలనుండి చూశారు. నా నవల విషయంకూడా చెప్పనీయండి. "The Storm" (తుపాను) లోని సెర్జీ వ్లాఖోవ్ పాత్ర కొందరికి అనుకరించ తగినదిగా కన్పడింది. మరికొందరికి మనోదారుఢ్యం లేని, స్వార్థపరతతో కూడినదిగా కన్పడింది.

చదవడం ఒక సృజనాత్మకమం. ఒక నవలను చదివి నపుడు పాఠకుడు రచయిత కృషికి తోడుగా మరికొంత పని చేస్తాడు. కథలోని లోపాలను తన ఊహలతో నింపుతాడు. తనకున్న అనుభవం పురస్కరించుకొని సహజంగా పాఠకుడు ఈ పని చేస్తాడు. ఒక నవలలోని పాత్రలను విభిన్న పాఠకులు విభిన్నవిధాలుగా అవలోకించుతారు. పాఠకుని ఊహ(కల్పన) ననుసరించి ఆ పాత్రలను ఉన్నతంగానో, నీచంగానో, సజీవం గానో, నిర్జీవంగానో మార్చుతారు. పాఠకుల సమావేశంలో తరచుగా నా నవలలను చర్చించినపుడు నేను హాజరయేవాణ్ణి. నా నవలలోని సాహిత్యలోపాలను వారు ఎత్తి చూపినపుడు ఆశ్చర్యపోయేవాణ్ణి. అంతేగాదు; మానవస్వభావంలో ఎన్ని

విభేదాలుండేవో చూచి ఆశ్చర్యపడేవాణ్ణి. పాఠకుడు ఒక్కొక్క పాత్రను తన హృదయానికి గాఢంగా హత్తుకొంటాడు; మరో పాత్రను నిర్లక్ష్యంగా చూస్తాడు.

ఇలాంటిది రచయితలకుకూడా సంభవించుతుంది. వారు ఒక విషయాన్ని గమనించుతారు. మరోదాన్ని నిర్లక్ష్యం చేస్తూ పరికించరు. బద్ధకస్తులవడంవల్లనో, మతిమరపువల్లనో ఈ పనిచేయడంలేదు వారు. వారి జీవితంలోనే, వారి స్వభావం లోనే గల ప్రత్యేక లక్షణాలివి.

ప్రతి రచయితా కొందరి హృదయాలలోకి చొచ్చుకు వెళ్ళగలడు. కాని మరికొందరిని అర్థంచేసుకోలేడు. అర్థం చేసుకొన్నా చాలా తక్కువగానే అర్థం చేసుకోగలడు.

ప్రతి రచయితకు హృదయ కవాటాలను తెరవడానికి బీగాలుంటాయి. కాని కొందరికి ఇతరులకన్నా ఎక్కువ హృదయకవాటాలు తెరవగల బీగాలున్నాయి. కాని అందరి హృదయాల కవాటాలను తెరచగల బీగాలు ఏ రచయితవద్దా లేవు.

రచయిత ఒకే రకమైన పాత్రలను సృష్టించడం మనం ఎరిగిన విషయమే. ఉదాహరణకు పూర్వసాహిత్యాన్ని తీసుకోండి. "తుర్గినెవ్ కన్యలు", "చెకోవ్ పాత్రలు", ఇలాంటి నిర్వచనాలు మనం చూస్తూనేవుంటాం. ఈ నమూనాలు ఆ దశకుమాత్రమే సంబంధించినవికావు; రచయితల ప్రత్యేక స్వభావాలు వారు ఎన్నుకొన్న ఈ నమూనాలలో వున్నాయి. తుర్గినెవ్ కాలంలో శక్తివంతమైన అధికారప్రియ స్త్రీలు లేరా? స్వార్థం, భోగలాలసతలు లేవా? సుఖప్రదమైన ప్రేమ

ఘటనలు లేవా? అయితే తుర్గినెవ్ శక్తివంతమైన అధికార ప్రియ స్త్రీలను చిత్రించలేదు; దూరాన్నుండి సుఖప్రదమైన ప్రేమను చూపించాడు. కాని, ప్రత్యేకశక్తితో, ప్రత్యేక గాఢావలోకనతో "తుర్గినెవ్ కన్య" లనబడే కథానాయికలను ఆయన చిత్రించాడు. గోథే, షెల్లింగ్‌లపట్ల ఆయన ప్రేమ, సాహిత్యలేక తాత్విక ఉత్సాహంవల్లనే ఇదంతా అని చెప్పడానికి వీలు లేదు.

శిథిలమయిపోతున్న పెద్దమనుష్యుల (Gentry) సమాజ చిత్రాన్ని ఈయడానికి, కొరగాని (Superfluous) ప్రజల చిత్రం ఈయడానికి, తుర్గినెవ్‌కు పరిశుద్ధ కన్యలూ, తప్పనిసరిగా పతనంపొందే కన్యలరూపాలూ అవసరమే. అయితే తుర్గినేవ్ తాత్విక అనుభవాలను (Spiritual experiences) గురించి మనం ఆశ్చర్యపడకుండా వుండలేము. వాస్తవిక జీవితంలో ఆయన తన పాత్రలను కలుసుకోలేదు. కాని ఆయన స్వంతజీవితమూ, పాత్రా "తుర్గినెవ్ కన్యల" లోని ఒక పాత్రలక్షణ్యాన్ని, స్వభావాన్ని తరచుగా మనకు జ్ఞాపకం చేస్తుంటాయి.

చెకోవ్ కాలంలో రష్యాలో దిట్టమైన విప్లవకారులున్నారు. వారు మేధావంతులేగాక, ఉక్కులాంటి మనోదార్ఢ్యం కలవారు. అయినా చెకోవ్ భగ్నజీవులను, అల్లిబిల్లి కలలుగనే వారిని, జీవితంయొక్క మొరటుతనానికీ, నైచ్యానికీ గురియై అణగిపోయిన, చైతన్యవంతులయిన స్త్రీ పురుషులను గురించే వ్రాశాడు.

చెకోవ్ ఉత్తరాలను చూచినా, అతని సమకాలికుల స్మృతిగాథలు చూచినా ఒక విషయం బోధపడుతుంది. చెకోవ్ అతిమెత్తని మనిషి. విచారగ్రస్తుడు. పెద్దపెద్ద గొంతులను సహించలేనివాడు. తనచుట్టూఉన్న ప్రజల బల హీనతలను, విఫలతలను క్షమించేవాడు. సాహిత్యంలోకూడా అలాంటి వ్యక్తిగానే చెకోవ్ నిలబడిపోయాడు. తన పాత్రలను ఎన్నుకోవడంలోను, తన పాత్రల చిత్రణలోను చెకోవ్‌ను నడి పించినది పైన చెప్పిన ఆ గుణాలే.

యువకుడుగా వున్నప్పుడు వ్రాసిన "బీదజనం" (Poor Folks) మొదలుకొని "కారమజోవ్ సోదరులు" అనే పుస్తకం వరకూ, డాస్టవస్కీ, స్త్రీ ఆంతరంగిక ప్రపంచాన్ని గురించి గాఢమైన చిత్రీకరణను ఎన్నడూ చేయనేలేదు. అతని గ్రంథా లలోని స్త్రీలు మృత్యువును రుచిచూస్తారు. అతని కథానాయ కుల భవిష్యత్తును మార్చడానికి మాత్రమే ఆ స్త్రీలు వస్తూ వుంటారు. అతని నవలలో పరస్పర ప్రేమగాని, నైతిక ఆధ్యా త్మిక సన్నిహితత్వంగాని వుండదు. అతని ఉద్యోగాలు, ఒంటరి తనం, కష్టాలతోకూడిన అతని యావజ్జీవితమూ, స్వభావా లతో ఇది సంబంధించి వుంది.

ఏ కారణంచేతనైనా గానీండి, రచయిత తనకు తెలి యని ప్రజలనుగాని, తను అర్థంచేసుకోలేని ప్రజలనుగాని చిత్రించితే, తప్పకుండా ఆ రచన విఫలమై తీరుతుంది.

చెకోవ్, చివరిరోజుల్లో ఒక విప్లవయువతిని గురించి వ్రాయడానికి సంకల్పించాడు.

"The Fiancee" (ది ఫియాన్సీ) అన్న ఆకథ చదివాక వెరెసాయెవ్ ఇలాఅన్నాడు: "ఆంటన్ పావ్లోవిచ్!: (చెకోవ్!) విప్లవంలోకి యువతులు చేరేమార్గం ఇదికాదు. ఇంతేగాక, నీవు వర్ణించిన "నాద్యా" లాంటి యువతులు అసలు విప్లవంలోనే జేరరు." చెకోవ్ తన తప్పుగ్రహించి కథను తిరిగి వ్రాశాడు. అయితే కథానాయిక పాత్రను అతడు మార్చలేదు. కథను మార్చాడు. ప్రచురింపబడిన కథలో, నాద్యా విప్లవంలో చేరదు. చెకోవ్ వ్రాసిన ఇతర కథానాయికలవలెనే నాద్యా సుఖమయ జీవనంకోసమై అస్పష్టమైన స్వప్నాలు కంటూ వుంటుంది. తన కాలంలోని ఒక విప్లవకారుని గురించి డాస్టవస్కీ చిత్రించదలచాడు. కాని, అది అసంబద్ధమైన వ్యంగ్య చిత్రం (కేరికేచర్) గా తయారయింది. ఎందువల్లనంటే "The Demons" (ది డెమన్స్) లో చిత్రించిన జీవితాన్ని డాస్టవస్కీ ద్వేషించడమేగాక, ఆ జీవితాన్ని అతడు అర్థం చేసుకోలేదు, అతనికి తెలియనూ తెలియదు.

"Dead Souls" (డెడ్ సోల్స్) లోని రెండవభాగంలో గొగోల్ వర్ణించిన ప్రజలు వాస్తవికంగా లేరు. వుండరు. బానిసత్వం (Serfdom) ప్రబోధించే వారూ, భూస్వాములూ అయిన వీరు ఉదారబుద్ధులట. ఈ గ్రంథరచన ఎలా అంత మయిందీ అందరికీ తెలిసినదే.

ఒకానొక రకమైన వాతావరణాన్ని సృష్టించలేదనో, కొన్నిరకాల పాత్రలను సృష్టించలేదనో రచయితలను కొందరు విమర్శించుతూ వుంటారు. ఒకానొక నవలపై ఏండ్లకొలది కాలాన్ని వినియోగించిన రచయితకు, సమీక్షకుని మనస్సులో

తక్షణం పుట్టిన ఆ అభిప్రాయం తప్పలేదని అనుకోగలమా ? కొన్ని రకాల సంవిధానం (థీమ్) గాని, కొన్ని రకాల పాత్రలు గాని ఒక నవలలో లేవంటే దాని అర్థం ఆ నవలా రచయిత మతి మరపు అని నా అభిప్రాయం కాదు. లేక అతడు చాలా త్వరగా తొందరపడి వ్రాశాడనీ కాదు. లేక అతను రాజకీయంగా అజ్ఞాని అనీ కాదు. కాని నేనిదివరలో ఉదహరించిన పరిమితులే వాటికి కారణం.

బూర్జువా వ్యక్తిత్వవాద ప్రచారకులు చెప్పే రీతిగా సోషలిస్టు సమాజం వ్యక్తిత్వాన్ని నాశనం చేయదు. పైగా వికసింపజేయడానికే ఉపయోగపడుతుంది. "చొరవ" వికసించే అమెరికాలో, పెట్టుబడిదారీ ఆర్థిక విధానాన్ని ఒక మతంగా తయారుచేసిన ఆ దేశంలో, ఆధ్యాత్మిక వాదాన్ని ఒకే మూసలో పోయడం రోజురోజుకూ ఎక్కువవుతోంది. సోవియట్ యూనియన్‌లో అలా గాదు. ఒకే ఆదర్శంతో ఐక్యమైన సోవియట్ స్త్రీ పురుషులు, ఒకరిని పోలి మరొకరు ఉండవలసిన అవసరం లేదు. ప్రతివారూ తన ప్రత్యేకతను (Particular make up) కలిగి వుంటారు. ప్రతిదానినీ, ప్రతివారినీ వర్ణించవలసిందని రచయితను ఎవరైనా అడగవచ్చునా? మేం ఎందుకు అలా అడగాలి ? మాకు అనేకమంది రచయితలున్నారు. ఒకరు వర్ణించలేనిదానిని మరొకరు వర్ణించగలరు. "చూడండి! ఆతను ఫలానా విషయాన్ని వర్ణించలేదు" అని విమర్శకులు అనకుండా వుండేందుకు కొందరు రచయితలు నిర్లక్ష్యంగా, నిరుత్సాహపూరితంగా కొన్ని పేజీలను నింపుతారు. అంతకన్నా విషాదకరమైన విషయం మరొకటి లేదు.

౪

ఒక ప్రముఖ రచయితను "మీ రచనలోని కథానాయ
కుని అసలు పేరేమిటి? ఎవరినో మనస్సులో పెట్టుకొని మీరు
పేరుతో మీరు వ్రాస్తున్నారుగదా. అందుచే అసలా వ్యక్తి
ఎవరు?" అని రచయితను ఒక్కొక్కప్పుడు అడుగుతూ
వుంటారు. నిజంగా ఉన్న వ్యక్తులనే, తానెరిగిన ప్రజలనే రచ
యితలు వర్ణించుతారని కొంతమంది పాఠకులు తలుస్తారు.
వాస్తవంగాఉన్న ప్రజలను రచయిత తన నవలలో చాల
తక్కువగా చిత్రించుతాడు. ఒకవేళ చిత్రించినా ఆ వ్యక్తులు
మారిపోతారు.

ఒక్క అక్షరం మార్చడంద్వారానే పోలివాయ్ తన
పేరు ఉచ్చారణను మార్చడమేగాక, ఆ పాత్రకు విభిన్న లక్ష
ణాలను కూడా సమకూర్చాడని మారెసీవ్‌ను కలుసుకొన్నాక
నేను తెలుసుకోగల్గాను. చారిత్రక నవలలో నిజమైన పేర్లనే
వ్రాసినప్పుడుకూడా, వారి పాత్రను తాను అర్థంచేసుకొన్న
విధంగా, వారి చర్యలకు తాను భాష్యం చెప్పేరీతిగా రచయిత
కొన్ని లక్షణాలను ఊహించి వాటిని ఆ పాత్రలకు ఆపాదించు
తాడు.

అలెక్సీ టాల్‌స్టాయ్ "పీటర్ ది గ్రేట్" అనే నవలను
వ్రాసే చాలాకాలానికి ముందే "పీటర్ దినచర్య" అనే కథ
వ్రాశాడు. రచయిత మారాడు. కాబట్టి అతని కథానాయకు
నిలో కూడా మార్పులు వచ్చాయి. "యంగ్ గార్డ్" అనే నవల
వాస్తవిక గాథపై ఆధారపడింది. కాని రచయిత ఈ కథలో
చాలా మార్పులు తెచ్చాడు.

కళాకారుడు ప్రకృతిని బొనిసలాగా కాపీ చేయడు. ప్రకృతిని మార్చి, నూతన రూపాలను సృష్టిస్తాడు. అవి వాస్తవికంగా తయారవుతాయి.

ఉదాహరణకు ప్రేమిక దంపతులిద్దరు మాట్లాడుకొనే సంభాషణలను ఎవరన్నా సంక్షిప్తలేఖిని ద్వారా యథాతథంగా వ్రాస్తారనుకోండి. ఒక మహారచయిత అదేసంభాషణను వ్రాశాడనుకోండి. వాస్తవానికి అంటిపెట్టుకొనే అతడు పై సంభాషణను చిత్రిస్తాడు. కొన్ని విషయాల్ని వదలివేస్తాడు. మరికొన్నిటిని అటూ ఇటూ మారుస్తాడు. ఇంతేగాక, ఆ ప్రేమికులు మనస్సులో అనుకొన్న విషయాలను, వారు బయటికి చెప్పలేకపోయిన వాటినీ కూడా చేరుస్తాడు. అపుడు ఆ రచయిత వ్రాసిన సంభాషణలతో పై సంభాషణలను పోల్చితే అవి చాలా కృత్రిమంగాను, ప్రాముఖ్యత లేకుండాను వుంటాయి.

రంగుల ఫోటోగ్రఫీ (ఫోటోగ్రఫీలాగా కన్పడే చిత్రం వలెనే)లో అసలువ్యక్తి చిత్రం వక్రంగా ప్రతిబింబించుతుంది. ఎందువల్లనంటే అతని బాహ్యారూపాలను లేక అనిశ్చిత భావ ప్రకటనను మాత్రమే వెలిబుచ్చగలుగుతుంది. నిజమైన కళాకారుడు ఆ వ్యక్తియొక్క అసలు వ్యక్తిత్వాన్ని (పర్సనాలిటీ) బయలుపెట్టే సంకలనం (సింథసిస్) తయారుచేస్తాడు.

పాత్రలను సృష్టించడంలో రచయిత వాళ్ళను మార్చుతాడు, చిత్రలక్ష్యాన్ని (Perspective) మారుస్తాడు.

ఫ్రెంచి చిత్రకారుడు మాటిస్సేనాకొకసారి ఒక ఆఫ్రికా వాస్తవ్యుడు చెక్కిన దంతపు ఏనుగులను రెండింటిని చూపించాడు. అవి కోపావేశాలలోవున్న ఏనుగులు. అందులో

ఒకటి నాకు బాగా నచ్చింది. "ఇందులో విచిత్రమైన అంశం ఏమీ కనపడటంలేదా!"అని మాటిస్సే అడిగాడు. లేదన్నాను. నాకు నచ్చిన ఏనుగును చూపించి, అది తొండంతోపాటు దంతాలనుకూడా పైకెత్తి వుండటం గమనించమని చెప్పాడు. అదే ఆ బొమ్మలో భావ ప్రకటనకు కారణం మాటిస్సే నవ్వుతూ ఇలా అన్నాడు: "ఎవడో బుద్ధిహీనుడు ఆ నీగ్రోతో 'దంతాలు పైకి తిరిగి వుండవు' అని అన్నాడట." ఆ నీగ్రో రెండవ ఏనుగును తయారుచేశాడు. దాని దంతాలు మామూలుగానే వున్నాయి. కాని అందులో భావ ప్రకటనా లేదు, కళా లేదు.

యుద్ధ బీభత్సాలను గురించి "గోయా" చిత్రించి నపుడు, అతడు శరీరశాస్త్రాన్ని (అనాటమీ) లెక్కచేయలేదు. కాని, 150 ఏండ్ల తర్వాతకూడా అతడు చిత్రించిన గాఢమైన వాస్తవికతనుచూచి మనం ఆశ్చర్యపోతాం.

అన్ని దేశాలలోని అన్ని దశలలోని అకాడమీ చిత్రకారులు వ్రాసిన యుద్ధచిత్రాలకంటె, గోయా చిత్రించిన యుద్ధం వాస్తవానికి సన్నిహితంగా వుంటుంది.

సాధారణంగా ఒక నవలలోని పాత్ర అనేక వ్యక్తుల మేళవం. అనేకమంది ప్రజలను అనేకసార్లు కలుసుకొన్నాక అవి సృష్టించబడతాయి. ఆ పాత్రలలో రచయిత తన యావ జ్జీవిత అనుభవాన్ని చొప్పించుతాడు. రచయిత తన నవలలో లేక కథలలో, అందరికీ తెలిసిన ఘటనలు మార్పుచేశాడనీ; తమ మాటలను తీసుకువెళ్ళి మరొకరినోట చెప్పించాడనీ; ఒక పాతస్నేహితుని బహిరాకృతిని పూర్తిగా వేరు జీవితంగల

మనోవ్యక్తికి అమర్చాడనీ - రచయితల సన్నిహిత మిత్రులు ఆశ్చర్యపోతూ వుంటారు.

ఆధునిక రచయితయొక్క మానసిక ప్రయోగశాలలను అర్థంచేసుకోడం కష్టమైనపని. మనప్రక్కనే రచయిత నివసించుతున్నా, అతని నడవడితోను, జీవితతోను మనకు తగిన పరిచయంవుండదు. ప్రామాణికమైన నవలలలోని (క్లాసిక్స్) పాత్రలు ఎలా ఉద్భవించాయన్న రహస్యాన్ని తెల్సుకోవాలంటే, మనం ఆ రచయిత ఉత్తరాలను తిరగవేయాలి. అతని డైరీలను, నోట్ బుక్కులను పరిశీలించాలి. ఆ రచయిత సమకాలికుల స్మృతిగాథలను అవలోకించాలి. తనకు నచ్చిన ఒక ప్రత్యేకవ్యక్తిని ఆధారంచేసుకొని ఆ నవలలోని పాత్ర సృష్టింపబడలేదనీ, అనేకమంది ప్రజల వ్యక్తిత్వాలను చూచాక రచయిత ఆ పాత్రను సృష్టించాడని అప్పుడు మనం గ్రహిస్తాం.

ఒక ప్రముఖ న్యాయాధికారి టాల్‌స్టాయ్‌కు ఒక కేసును వర్ణించి చెప్పాడు. ఆ కేసు టాల్‌స్టాయ్‌ను ఆకర్షించింది. "పునరుజ్జీవనం" (Resurrection) అనే నవలకు మూలమిదేనని చెబుతారు.

ఈ నవలలో లేవనెత్తిన సమస్యలు టాల్‌స్టాయ్‌ని యావజ్జీవితమూ వేధించాయని మనకు తెలుసు. ఈ ఉద్యోగి చెప్పిన కథ వివరాలు టాల్‌స్టాయ్ తన నవల సంవిధాన (ప్లాట్) అంతిమరూపం దిద్దడానికి సహాయపడింది. ఈ నవలలోని ఇతివృత్తం. ఎప్పుడో చాలకాలంక్రితమే పుట్టింది (టాల్‌స్టాయ్ ప్లాట్‌కూడా మార్చాడు. అయితే అది ఏవిధంగానూ ఆ ఉద్యోగి వర్ణించిన కేసును పోలిలేదు).

అయితే, ఆ పరిశీలన మామూలు పరిశీలనగాదు. ఇతరులు అనుభవించి, చెప్పినవిషయాలను స్వయంగా అనుభవించిన దానితో మేళవించిన పరిశీలనఅది. నిజంగా నమూనాలనదగిన పాత్రలను, సమాజాన్ని ప్రతిబింబించే నిజమైన పాత్రలను, కళాకారుడైన రచయిత గంభీరంగా చిత్రించడానికి ఈ పరిశీలన తోడ్పడుతుంది.

నమూనాలంటే అర్థం లెక్కలూ, అంకెలూ అనికాదు. ఒక నవలలోనిపాత్రను పోలినవ్యక్తులు 30 లక్షలమంది వుంటే, నమూనాపాత్రను సృష్టించడంలో రచయిత విజయం పొందాడని, మూడువేలమంది మాత్రమే వుంటే, ఆ రచయిత విఫలుడయ్యాడనీ చెప్పడం అసాధ్యమైన విషయం. రచయిత తన సమాజ జీవితాన్ని అనుభవించుతాడు. జీవిత సమ్మర్దంలో ఏం జరుగుతూవుందో అతడు చూపించుతాడుగాని, అతడు సమాజానికి బయటవుండేజీవితాన్ని చూపించడు. అతడు చలనాత్మకప్రజలను, జాతులను చూపించుతాడు, "చాట్స్కీ"ని ఉదాహరణగా తీసుకొంటే లెక్కలు, అంకెలతో ఆ పాత్రకు సంబంధం లేదు. కాని, రష్యాలోని అభివృద్ధికాముక ముతాల తీవ్ర ద్వేషాన్ని, అస్పష్టమైన ఆశలనూ చాట్స్కీపాత్ర వెలిబుచ్చింది. "గోంచరోవ్" ఆబ్లొమోవ్ అనేపాత్రను సృష్టించాడు. విచిత్రమైన ఉదాహరణగా ఆబ్లొమోవ్ పాత్రను అతడు సృష్టించలేదు. అలాంటి వ్యక్తులు సామాజిక విషాదాంత నాటకానికి చిహ్నాలు గాబట్టే ఆ పాత్రను సృష్టించాడు.

ఆనా కెరనినా ప్రేమను తీసుకొంటే, అంత గాఢప్రేమ చాలా అరుదైన విషయం. కాని, అది అందరి మనస్సును హత్తుకొనే చిత్రీకరణ.

మన సమకాలికులైన బూర్జువా రచయితలు ఎందుకు అంత చవిటిపర్రలై పోయారు? జీవితంనుండి దూరంగా వారు పరుగెత్తిపోవడంవల్ల, ఇతరులతో ఎట్టి పోలికాలేని వ్యక్తులను సృష్టించడంవల్ల వారలా తయారయ్యారు.

వారు చిత్రించినలాంటి వ్యక్తులు అసలు లేరనా? వుంటారు; మనం అనుకొన్నదానికంటే ఎక్కువగాకూడా వుండవచ్చు. కాని, వారిని గురించివర్ణన పాఠకుని కదల్చలేదు. కారణం, తనయొక్క, తనకాలంయొక్క ప్రతిబింబాన్ని పాఠకుడు కోరతాడు. స్టెంధాల్ కాలంలో ఫ్రాన్సులో ప్రతి జంక్షన్ వద్దా జ్యూలియన్ సోరెల్, లూసియన్ లూవన్‌లాంటి వ్యక్తులు లభ్యమయ్యేవారని మనం భావించరాదు. అలాంటి కాల వ్యక్తులు చాలాఅరుదని నా అభిప్రాయం. ఆ కాలపు గాఢ కాంక్షల, అభీష్టాల కేంద్రీకృత రూపాన్ని సూచించేటటు వంటివి ఆ పాత్రలు. ఇప్పుడుకూడా రూపంమార్పుతో ఆ వ్యక్తులు వున్నారు. అందుచేతనే స్టెంధాల్ పుస్తకాలను ఇంకా చదువుతున్నారు. బహుశా చాలాకాలంవరకు చదువుతారు కూడా.

ఆధునిక బూర్జువా నవలలోని పాత్రలు మానవ గాఢ కాంక్షల సముదాయంకాదు. అందులో కన్పించేవి కుతూహలం కల్గించుతాయి. అరుదైన తత్వాన్ని ప్రదర్శించుతాయి. అవి వైద్యశాస్త్ర పుస్తకాలలో వుండవలసినవి. హోమోసెక్స

యలిస్టునీ, తనభర్తను ప్రేమించక కుంచించుకుపోయిన స్త్రీనీ, ఏకారణం లేకుండానే ఆత్మహత్య చేసుకొనే వ్యక్తినీ ఈ నవలలు చిత్రించుతున్నాయి.

ఏదో ఆకస్మిక ఘటన రచయితదృష్టిని సాధారణంగా ఆకర్షించవచ్చు. కాని, కొంచెం ఆలోచించిన పిదప దానిని గురించి వెంటనేగాని, ఆ తరువాతగాని వ్రాయడు. ఒక మనిషి, లేక ఘటన రచయితను ఆశ్చర్యపరచవచ్చు. రచయితనేగాక ఇతరులనుకూడా ఆశ్చర్యపరచవచ్చు. కాని, మానవతా విలువలు ప్రతిబింబించని ఘటనలు, వ్యక్తులు, రచయిత బుర్రలో నిలవబోరు.

ఒక నవలలోని పాత్రలు ఫోటోగ్రాఫుల సంపుటికాదు. లేక ఒకవ్యక్తికీ సంబంధించిన ప్రశ్నపరంపరల ఫైలూకాదు. రచయిత ఊహాచిత్రాలే ఆ వ్యక్తులయినా వారు వాస్తవిక వ్యక్తులే. ఎందుచేతనంటే, జీవితాన్ని లోతుగా చూచి అన్వయించే నైపుణ్యం గల రచయిత ఆ పాత్రలకు జీవంపోస్తాడు. తను సృష్టించిన పాత్రలతో రచయిత ప్రపంచాన్ని నింపుతాడు. "గ్రిబాయెడావ్" వ్రాసిన "Wit Works Woe" (నవ్వు నాల్గు విధాలచేటు) అన్న గ్రంథం వ్రాసేవరకు చాట్స్కీ లాంటి వ్యక్తులు రష్యాలో వున్నారా? ఉన్నారు. అయితే ఆ వ్యక్తులే తామీ పాత్రలలాంటివారమని గ్రహించలేదు. వారి చుట్టూవున్న ప్రజలు కూడా వారిని స్పష్టంగా అర్థంచేసుకోలేకపోయారు. ఈ గ్రంథంవ్రాశాక, "అదుగో చాట్స్కీ" అనడంపరిపాటి అయిపోయింది. గొగోల్ తన గ్రంథాలలో అనేక తరాలవాళ్లను పరిచయంచేశాడు. అనేకమందిని గుంపులకొలదీ ప్రవేశ

పెట్టాడు. ఈ నాటికీ ఖ్లెస్ట కొవ్ లాంటి అబద్ధీకుణ్ణి, డాంబికుణ్ణి మనం చూస్తూనే వుంటాం. "మానిలావ్ తత్వాన్ని" ఇప్పుడూ చూస్తూనేవుంటాము ("మానిలావ్ తత్వం" అంటే, నిరర్థకమైన పగటికలలు కనడం, బద్ధకం, ఉపేక్షాభావం. గొగోల్ వ్రాసిన "డెడ్ సోల్స్"లోని ఒక పాత్ర మానిలోవ్).

లిసా, ఆస్యా, జెమ్మా అనే పాత్రలను నిజంగానే ఈ యువతులు ఉన్నట్లుగానే ఊహించి యువకులు ప్రేమించుతారు. గోర్కీ నవల "అమ్మ" మనకు ఒక చారిత్రకవ్యక్తిగా కన్పించుతుంది. ఆమె మనకు కల్పితపాత్రగా గాక, నిజంగా జీవించుతున్న పాత్రలాగా కన్పడుతుంది.

రచయిత కృషిలో చాల కష్టమైనపని పాత్రలనుకనడం. ఒక యంత్ర వస్తువులాగా ఆ పాత్రను సృష్టించడం సాధ్యం కాదు. అది చాలా క్లిష్టమైన పరిణామం.

## 9

రచయిత ప్రజలను పరిశీలించినప్పుడు వారిని గురించి అన్ని విషయాలను చూడలేడు. మానవ హృదయాన్ని అర్థం చేసుకోవడంలో ఎంతో అనుభవంగలవారు సైతం కనిపెట్టలేని గుప్త ఆలోచనలు, రహస్యభావాలు వుంటాయి. ఈ ఆలోచనలు, భావనలు ఎంతో వత్తిడి ఏర్పడినప్పుడు మాత్రమే బయట పడతాయి. వాటిని అతని సన్నిహితులు అప్పుడు చూడగల్గుతారు, గ్రహించగల్గుతారు. నవలలోని పాత్రలను సృష్టించే

టప్పుడు రచయిత తన పరిశీలనపైనే ఆధారపడడు, తన అను భవం, ఆవేశాలపైనకూడా ఆధారపడతాడు.

ఇబ్సన్ జీవితం ఎంతో కష్టాల నిలయం. అతని అసం ఖ్యాక నాటకాలు అన్నీ అతని సుదీర్ఘమైన స్వగతం అని చెప్ప వచ్చు. ముసలితనంలో ఇబ్సన్ ఈ క్రింది విషయాన్ని అంగీ కరించాడు. "కళాకారుడు తనలో కనుగొనగల్గిన నమూనాను మాత్రమే కనీసం కొంతభాగం, కనీసం కొంతకాలం సృష్టించ గలడు". దీని అర్థం ఇబ్సన్‌కు నార్వే సమాజం తెలియదనిగాని, అతని రచనలలో అతనొక్కడే ప్రతిబింబించాడనీ, అతని అనుభ వాలు మాత్రమే పొందుపరచబడ్డాయనీ కాదు. అతని నాట కాలలో మనం అనేక విభిన్నమైన పాత్రల నమూనాలు చూస్తాం. కాని, రచయిత ముద్రమాత్రం అన్నిటిపైనా వుంటుంది.

మదాంబోవారీ అనే నవలలో "ఎమ్మాబోవారీ" పాత్రకు ఎవరు మూలం అని అనేక సంవత్సరాలు ఫ్రెంచి పండితులు వాదవివాదాలు కొనసాగించారు. రోవెన్ (Roven) పోలీసు రికార్డులన్నీ తిరగా బోర్లా చూశారు. సుమారు పదిమంది దాకా ఆ పాత్రకు మూలంఅని భావించబడేవారు దొరికారని నాకు జ్ఞాపకం. ఈ నవలారచయిత ఫ్లాబర్ట్‌ను ఒక చిన్న పత్రికావార్త ఆకర్షించి వుండవచ్చు. కాని ఏదో మామూలువార్త చదివిచదవడంతోనే ఈ నవలా రచనకు ప్రారంభించాడని నేను అనుకోను. తన దృష్టికితగిలిన అనేక మంది స్త్రీలతో అతడు కలుసుకొని మాట్లాడి వుండవచ్చు. ఈ నవలారచనకు చాలాకాలం అతడు కృషిచేసి యుండవచ్చు.

ఇంతేకాదు; మరో విచిత్రమైన సంగతికూడావుంది. తన స్నేహితులకు వ్రాసినవుత్తరాలలో ఫ్లాబర్ట్ "ఎమ్మాపాత్రను నేనే!" అని వ్రాశాడు. ఇది అసంబద్ధంగా మొదట కన్పించవచ్చు. ఫ్లాబర్ట్ పెళ్ళివచ్చిన బ్రహ్మచారి. అదోరకంగా వికారం గొలిపే ముఖం. అనుమానమనస్కుడు. అయినా ఉన్నత రస పిపాసి. తుర్జినెవ్ సైతం ఇతని అభిప్రాయాలకు చెవియొగ్గేవాడు, అలాంటి ఫ్లాబర్ట్‌కూ, నిలకడలేని, నాజూకులేని వ్యభిచారిణీ, సంకుచితబుద్ధి గలదీఅయిన బొవారీకీ సంబంధంయేమిటి? అయినప్పటికీ ఎమ్మాపాత్రలో ఫ్లాబర్ట్ తనను ఎక్కువగా చొప్పించాడు. అతని మరణానంతరం వెలువడ్డ లేఖలలో యిది బయటపడింది (జీవితంలోగాకపోయినా సాహిత్యంలో ఆడంబరతఅంటే ఫ్లాబర్ట్ మొగ్గేవాడు. అందుచేత నాజూకుతనం లేకపోవడంఅనే దానిని దీనికి వర్తింపచేయవచ్చు. "సాలంబో" (Salambo) అన్న రచన, మదామ్ బొవారీ స్వప్నాలకు పూర్తిగా తగినట్లువుంటుంది).

పాఠకుడు ఒకప్రశ్న అడగవచ్చు.

మామూలుగా దుష్ట (నెగెటివ్) పాత్రలని పిలువబడే పాత్రలు ఎలా సృష్టింపబడతాయి? రచయితకు నిశిత దృష్టి వుంటేచాలునని ఇక్కడ మీ అభిప్రాయమా? — అని పాఠకుడు ప్రశ్నించవచ్చు. అలాంటి పాత్రలను సృష్టించినప్పుడు కూడా రచయితకు అతని స్వీయానుభవం సహాయపడుతుందని నేను అనుకొంటాను. తను సృష్టించిన పాత్రల అనుభవాల నన్నిటినీ రచయిత అనుభవించ నవసరంలేదనీ, కాని అలాంటి పోలికగల అనుభవం తన పాత్రల ఆంతరంగిక ప్రపంచాన్ని

అర్థం చేసుకోడంలో అతనికి సహాయపడుతుందనీ, నేనిదివరకే చెప్పాను. మోసగాడు, స్వార్థపరుడు, పిరికిపంద మొదలైన పాత్రలను సృష్టించడానికి రచయిత స్వయంగా తాను అలాంటి గుణాలను కల్గియుండవలసిన పనిలేదు.

నీచమని తాము భావించిన గుణాలను – అవి ప్రారంభంలోవున్నా, బాగా జీర్ణించుకు పోయినవైనా – అతిక్రమించడానికి రచయితలతో సహా ప్రజలంతా కృషి చేస్తారు, సమాజం కూడా కృషి చేస్తుంది. రచయితకు చాలా జ్ఞాపకశక్తివుంటుంది. తన బాల్యంలో, యుక్తవయస్సువచ్చేముందు, యుక్త వయస్కుడయ్యాక, తాను అణచుకొన్న చెడుగుణాలు అతనికి జ్ఞాపకంవుంటాయి. వాటినే పెంపొందిస్తే వంచన, పిరికిదనం, స్వార్థపరత్వం మొదలైనగుణాలుగా అవి వృద్ధి చెందేవి. ఒకప్పుడు గాకపోతే మరొకప్పుడు తన సన్నిహితుల లోనో, తనలోనో కన్పడిన దుర్గుణాలను ప్రత్యేకంగా అతడు ద్వేషిస్తాడు. భయాన్ని అతిక్రమించడమే సాధారణంగా ధైర్యం అని అర్థం. కాని, ఎన్నడూ భయమనేదే ఎరుగని అసాధారణ మైన స్వభావాలు కలవారుంటారనుకోండి. రచయితకు అలాంటి స్వభావంవుంటే, అతడు పిరికివాని ప్రవర్తనను వర్ణించుతాడు గాని తన స్వంత ఆంతరంగికపరిస్థితిని వర్ణించడు.

వ్యంగ్య రచయిత (Satirist) అతిశయోక్తి అంటే భయపడడు. సాల్టికోవ్ – ష్కెడ్రిన్, "గ్లుపోవ్ పట్టణకథ" (The story of the town of Glupov) కన్న భిన్నమైన ధోరణిలో గోలొవ్ల్యొవ్స్ (Golovlyovs)ను వ్రాశాడు. శైస్త్ర ...వ్ తన అతి దుర్గుణాలతో మనకు వినోదం కల్గించుతాడు

లేదా భయపడతాడు. కాని గొగోల్ "ఇనస్పెక్టర్ జనరల్"లో మామూల మానవో(దేకాలతో కూడిన ఒక్క శిష్ట (Positive) పాత్రనుకూడా ప్రవేశపెట్టలేకపోయాడు; ప్రవేశపెట్టలేదుకూడా. ఒకొక్కప్పుడు తప్పుచేసినా, నైతికంగా, చిత్తశుద్ధిగల్గిన ప్రజలను తమ పుస్తకాలలో రచయితలు ప్రవేశపెట్టడంతో పాటు, పూర్తిగా దుర్మార్గుడైన విలన్ (దుష్టపాత్ర)ను కూడా ప్రవేశపెడుతూ వుంటారు. ఇలాంటి దుష్టపాత్ర అసంభవంగా పాఠకులకు కనపడుతుంది. పెన్సిల్ డ్రాయింగ్‌లలోగాని, ఎచింగ్ (ద్రావకంతో బ్లాకులు మొదలైనవి చెక్కడం) లో గాని చిత్రకారుడు తెలుపు, నలుపురంగులను వుపయోగించు తాడు. పూర్తి తెలుపునుగాని, పూర్తి నలుపు రంగునుగాని చిత్రకారుడు వుపయోగించడు. వాటిని ఇతరరంగులతో కలుపు తాడు. ఎందువల్లనంటే, నీలిమాకాశం లేక పచ్చనిచెట్ల ప్రక్క నల్లటిరంగును ఉపయోగించితే అది ఒక కంతలా కనపడు తుంది; తెలువు ఉపయోగించితే ఉబ్బెత్తుగా (High Relief) కన్పించుతుంది. ఒక సమాజ చిత్రాన్ని చిత్రించేటప్పుడు, మంచివారితోపాటు చెడ్డవారిని చిత్రించేటప్పుడు, రచయిత సరియైన పాళ్ళకోసం ప్రయత్నించుతాడు; అన్ని పాత్రలను జీవితంలో నిజంగావున్నవారిలా చేయడానికి ప్రయత్నించు తాడు. ఇది చేయాలంటే వాని హృదయ కవాటాలకు తాళం చెవులు సంపాదించాలి.

## 10

ఒక నవలను వ్రాయడంలో, పాత్రలను సృష్టించడంలో వివిధ రచయితలు వివిధ మార్గాలను అవలంభించుతారు. కొందరి రచనా విధానం భవన నిర్మాతల పద్ధతిని జ్ఞప్తికి తెస్తుంది. తనను ప్రేరేపించిన విషయాన్ని పోల్చిచూడు కోడానికి కంపాస్‌లూ, రూళ్ళకర్రలూ వుపయోగించుతాడు అతడు. మరికొందరు రచయితలు మట్టిముద్దను మానవ ముఖా కృతిలోకి క్రమంగా మార్చే శిల్పుల లాంటివారు. ఒక నవల మొదటిఅధ్యాయం ప్రారంభించేముందు వివరంగా పథకం వేసుకొనే రచయితలున్నారు. మరికొందరు వ్రాస్తూ పోతూ వుండగా కథను నడిపించేవారున్నారు.

గతకాలంలోని మహారచయితల నవలల చిత్తుప్రతులు ఇదే విషయాన్ని తెలియజేస్తున్నాయి. నేను అనేకమంది ఆధునిక రచయితలతో కూడా మాట్లాడాను. వారు కూడా తమ రచనలనుగురించి చెప్పినప్పుడు ఇదేవిషయాన్ని తెలియ జేశారు. మార్పులురావడానికి కారణం ఇది. రచయిత తాను వ్రాయదలచుకొన్న నవలలోని కథానాయకుని తాను ఎన్నాళ్ళ నుంచో మనస్సులో సృష్టించుకొంటూ వచ్చినప్పటికీ, అతడింకా సజీవ వ్యక్తి కాదు. ఇంకా అతడు నీడ మాత్రమే; అందుచేతనే మార్పులు వస్తాయి. ఆ నీడకు రక్తమాంసాలు కల్పించ వలసివస్తుంది. అలాకల్పించి ఆ పాత్రను సజీవంగా చరయిత చేసేటప్పటికి, ఆ కథానాయకుని చర్యలన తాను సరిగ్గా ముందుగా చూడలేకపోయినట్లు అతడు గ్రహించ తాడు. తాను ఊహించిన పథకంలో కథానాయకుని చర్యల

తాను ఆలోచించనవీ, అనుకోననివీ, చేయనివీ కూడా కన్పడ తాయి. వాటిని మార్చాల్సిన అవసరం అప్పుడు రచయితకు ఏర్పడుతుంది.

అందుచేతనే తన నవలల్లో కథాగమనం ఎలా వృద్ధి చెందుతుందో తాను గ్రహించలేని అలెక్సీటాల్‌స్టాయ్ చెబు తున్నాడు. మొట్టమొదట రచయిత తన ప్రధానపాత్రతో బాగా పరిచయం ఏర్పరచుకోవాలి.

రచయిత వేసుకొన్న <u>పథకానికి (ప్లాట్)</u> కథారచన లోని పాత్రలు లొంగవు. అవి అటూ యిటూ మారతాయి. రచయిత ప్లానును ప్రతిఘటించుతాయి. నేనిదివరలో చెప్పిన చెకోవ్ కథ "ది ఫియాన్సీ" వుంది. ఇది ఒక ఉదాహరణ. ఇలాం టివే ఎన్నో వున్నాయి. అసహజమైన విషయాలను చేయవల సిందని పాత్రలకు రచయిత ఆజ్ఞాపించాడనుకోండి. తప్పకుండా ఆపాత్రలు విఫలం అవుతాయి. అలాంటి పుస్తకం కళా విహీనంగా ఉన్నదని రచయిత వెంటనే గ్రహిస్తాడు.

తన పాత్రలు సజీవమైన ప్రజలుగాని, ఎటుపడితే అటు త్రిప్పే చదరంగం పావులుకావు. చదరంగంలో సైతం ప్రతి పావుకూ ఒక గమనంవుందన్న విషయం జ్ఞాపకం వుంచుకోవాలి. కొంతవరకు పుస్తకంలోని పాత్రలు, రచయిత మనోభీష్టానికి సంబంధం లేనివని చెప్పవచ్చు.

రచయిత వాటి స్వభావాలను అర్థం చేసుకోవాలేగాని, అవి సరిగా ఎలా ప్రవర్తించాలో దానిని గురించి వాటికి ఆదేశించలేడు.

పాత్రలుచేసే తప్పులకు కొందరు విమర్శకులు రచయితనే నిందించుతారు. చిత్తశుద్ధిగల, ధైర్యవంతులైన ఉదాత్తులైన ప్రజలను గురించి, సజీవ ప్రజలను గురించి రచయిత వ్రాస్తున్నప్పుడు, రచయిత వారి బలహీనతలను కప్పిపుచ్చలేడు. వారి పొరపాట్లను, అపజయాలను దాచలేడు. ఎందుచేతనంటే రచయిత చిత్రించదలచినది ప్రజల్నిగాని, అట్టబొమ్మల్నికాదు.

రచయితలు వట్టి అమాయకులనీ (సింప్రుల్‌టన్స్), తమ పాత్రలు తప్పుచేస్తున్నాయనీగ్రహించక తమకంతా తెలిసినట్లు నటించే రాజకీయ అజ్ఞానులని విమర్శకులు భావించుతున్నారా? ప్రజలూ, సమాజమూ, జీవితమూ ఒకవ్యక్తియొక్క దోషాలను చూపించుతారు. ప్రజలు ఎలా కాలుజారుతారో చూపించి సరిదిద్దుతారు. అలాగే సరియైన మార్గాన్ని పాఠకునికి చూపించుటలో రచయిత తోడ్పడతాడు. ఒక పుస్తకంలోని గ్యాలీలను ప్రూఫ్‌రీడర్ దిద్దినట్లు రచయిత తన పాత్రలజీవితాన్ని సరిదిద్దలేడు.

ఒక గ్రంథంలోని పాత్రలు సజీవప్రజలు కాబట్టి రచయిత వాటిని ప్రేమిస్తాడు. వాటితోపాటు నవ్వుతాడు, ఏడుస్తాడు. పియరీ గోరియట్ మరణాన్ని వర్ణించుతున్నప్పుడు బాల్జాక్ జబ్బుపడి డాక్టరును పిలిపించదలచాడన్న వార్త నిజమో, కాదో నాకు తెలియదు. ఇది కట్టుకథ అయినా, కాకపోయినా, తన పాత్రలపట్ల బాల్జాక్ వైఖరిని ఇది తెలియజేస్తుంది. తాను ప్రేమించినపాత్ర మరణాన్ని వర్ణించేటప్పుడు రచయిత దుఃఖానుభూతినిపొందకుండా దానినెలా వర్ణించగలడు? రచయితలకు వాస్తవిక మరణం సంభవించేముందు,

అతడు అనేకసార్లు మరణయాతనలను అనుభవించవలసి యుంటుందని కూడా నేను చెప్పవలసివుంది. బాల్జాక్ చాలా వైవిధ్యం కలవాడు. ఇతర రచయితలు తమ సన్నిహితులకు చెప్పక దాచివుంచే విషయాలను అనేకాలను బాల్జాక్ వర్ణించాడు.

ఒక నవలను పూర్తిచేశాక, చాలాకాలంగా తాను కష్టపడి చేసినపని పూర్తి అయిందికదా అని సంతోషాన్నీ, ఉపశమనాన్నీ (రిలీఫ్‌నూ) పొందుతాడు. ఆ తర్వాత గాఢమైనవిచారం క్రమ్ముకవస్తుంది. ఎంతో సన్నిహితంగా ఎరిగియున్న ఆత్మీయులనుండి దూరంచేయబడినట్లు అతడు బాధపడతాడు. వెనుకటి గ్రంథాలలోని పాత్రలు గత కాలంలోకి అదృశ్యమైపోయినా, రచయిత పూర్తిగా వాటితో సంబంధాన్ని తెగతెంచుకోడు. అదృశ్య సమూహంలాగా అవి అతనిని చుట్టుముట్టుతాయి.

బిడ్డను కనడం అంటే ఏమిటో ప్రతి తల్లికి తెలుసు. దానిని లియోటాల్‌స్టాయ్ కూడా అర్థం చేసుకొన్నాడు. అద్భుతంగా దానిని వర్ణించాడుకూడా. కాని దానిని మన విమర్శకలంతా అర్థం చేసుకున్నారా అనేది నాకు తెలియదు.

# 11

సుదీర్ఘమైన నవల వ్రాసిన రచయిత కూడా తనపాత్రల యావజ్జీవితాన్ని చిత్రించలేదు. అత్యంత ముఖ్యమైనవి అనుకొనే వాటినే అతడు ఎన్నుకుంటాడు. ఆపాత్ర జీవితంలోని ఒక

రోజు జీవితాన్ని అతివివరంగా ఒక్కొక్కసారి అతను చిత్రించు తాడు. ఆ తర్వాత రెండేళ్ళ జీవితాన్ని గురించి ఒక్కముక్క కూడా చెప్పకపోవచ్చు. ఆ పాత్ర నివసించే గృహం గురించి వివరంగా అతడు వర్ణించవచ్చు. కాని ఆ పాత్ర భార్య ఎలా వుంటుందో కూడా వర్ణించవలసిన అవసరంలేదని అతడు భావించ వచ్చు. రెండవరకంపాత్ర మూర్తిని అతడు చిత్రించవచ్చు. ఆకురాలు కాలంలోని ఉదయం లేక వసంతకాల సాయంత్రం గురించి అతను వర్ణించి పైన చెప్పిన ఆ ఉదయాన లేక సాయంత్రం పనిచేసే ఆ వ్యక్తియొక్క వయస్సును అతను వర్ణించకపోవచ్చు.

చాలామంది రచయితలు తమ నవలలను సినిమా తీయ డానికిగాని, నాటకంగా మార్చడానికిగాని, చివరకు బొమ్మలు చేర్చడానికిగాని ఇష్టపడరు. స్టేజి డైరక్టర్, లేక నటకుడు చిత్ర కారుడు ఊహించిన చిత్రాలకు విభిన్నమైన చిత్రాలు రచయితల మనస్సులో వుంటాయి. పాఠకునికి చెప్పిన దాని కంటెకూడా రచయితకు తన పాత్రలను గురించి ఎక్కువ తెలుసు. వ్యక్తిస్వభావాన్ని, అతనినడవడికనీ విశదపరచేటటువంటి ఘటనలను, జీవిత వివరాలను, ఆలోచనలను భావనలను రచయిత ఎన్నుకొంటాడు. పాఠకుడు పుస్తకం చదవడం ముగించగానే తన కా కథలోనిపాత్రలతో పరిచయం అయినట్లు వాటి జీవితాన్ని తెలుసుకొన్నట్లు, వారిహృదయాలను తెలుసు కొన్నట్లు పాఠకుడు భావించాలి. చెకోవ్ "డార్లింగ్" అనే కథ చాలా చిన్నకథ. కాని ఆ కథ చదివిన ప్రతివాడూ, ఆ కథా నాయికను, ఆమెవద్ద పండ్లకొలదీ నివసించిన వారి లాగా, ఊహించుకోగలడు.

సోవియట్ సాహిత్యం చాల పాత్రలను సృష్టించింది. వాటిని పాఠకులకు బాగా తెలుసు. ఆ పాత్రలను వారు ప్రేమిస్తారు కూడా. కోష్కిన్, లెవిన్సన్, గ్రిగరీమెలెఖావ్, డేవిడోవ్, కిరిల్ ఇన్నోకోవ్, సైనికుడు ఇగ్నాపివ్, - ఇలా ఎన్నో పాత్రలను ఉదహరించవచ్చు. ఒక మనుష్యుని వాస్తవికంగా చిత్రించడానికి సాధనంగా ఒకపద్యం అంతగా ఉపయోగకారి కానట్లు కనపడవచ్చు. కాని వాసిలి టోర్కిన్ అనే పాత్రతో మనకందరికీ బాగా పరిచయం వుంది. అతనిని ఎన్నోసార్లు కలుసుకొన్నట్లు అనిపించుతుంది.

లెనిన్‌గ్రాడ్ ఇంజనీర్ అంతగా బాధపడ్డ నవలలు, సఫలం కాని నవలలు చాలా పేజీలను కల్గియుండవచ్చు. కాని పాఠకునికి ఆ పాత్రల ఆంతరంగిక ప్రపంచం గురించి ఏమీ తెలియదు. అలాంటి పాత్ర లున్నవనే అతడు నమ్మజాలడు.

రచయితలో నైపుణ్యం లేకపోవడంవల్ల యిది సంభవించలేదు. పాత్రలను అబద్ధంగా చిత్రించడం, సరిగా చిత్రించలేకపోవడంవల్లనే యిది సంభవించుతోంది అని నా అభిప్రాయం.

సోషలిస్టు సమాజం నిర్మించకముందు అసాధ్యమైనటువంటి నూతనమైన కృత్యాలను, ఆలోచనలను, మనోవికారాలనూ, (Emotions) మన ప్రజల మంచిస్వరూపాలను చూపించడానికి సోవియట్ రచయిత ప్రయత్నించడం పూర్తిగా సహజమే. ఈ కృత్యాలు సజీవప్రజలు చేస్తున్నారు. ఈ ఆలోచనలు ఉద్రేకాలు ఇతర ఆలోచనలు, భావనలతో పాటే ప్రక్కప్రక్కన వుంటున్నాయి. ఆ ఇతర ఆలోచనలు పాతరోజుల భావాలనుండి పుట్టుకువచ్చాయి. మన సమకాలికులు భవిష్యత్

యుగాల ఆదర్శమానవులకు ఉదాహరణలు కారు. అనేక కష్ట పరిస్థితులలో వారు ఇదివరకెన్నడూ సాధించని పనులను సాధిస్తున్నారు. కాని ప్రతివానికీ కొన్ని లోపాలు బ. హీనత లున్నాయి. ప్రతివాడు తన స్వంతమార్గాన నివసించుతాడు. ప్రేమిస్తాడు, అసూయపడతాడు, ఆశలో నింపివుంటాడు లేదా నిరాశతో క్రుంగిపోతాడు. సంతోషించుతాడు లేక దుఃఖిస్తాడు. పాత్రలను ఒక భాగం మాత్రం చూపించుటద్వారా, ఆ పాత్రను "నీచ పరుచుతుందని అనుకొనే భాగాన్నంతటినీ వదలివేయడం ద్వారా, అతని ఉత్సాహాన్ని, శ్రామిక విజయాలను మాత్రం వర్ణించుటద్వారా ఆపాత్రను రచయిత అవాస్తవికం చేస్తున్నాడు.

ఒక్కొక్కప్పుడు ఏమైనాసరే పాఠకుని తన అభిప్రాయాలతో ప్రభావితుణ్ణి చేయాలనే కోర్కెతో రచయిత రచన సాగించుతాడు. అలాంటి రచనలనుండి పుట్టే పాత్రలు రూళ్ళకర్ర (స్కీమెటిక్) స్వభావం కలిగివుంటాయి,

నవల, వార్తాపత్రికలోని వ్యాసం కాదన్న విషయాన్ని అతడు మరచిపోతాడు. ఎంతో బాగావున్నదనుకొన్న పోస్టర్, చిత్ర రచన (పెయింటింగ్) కాజాలదని అతడు మరచిపోతాడు. వాస్తవిక జీవితాన్ని కొద్దిగామాత్రం చూపించితే, యీాషికగా వుంటుందని భయపడి, రచయిత, తన కల్పిత ఆదర్శ కథానాయకునికి అన్ని సద్గుణాలనూ అంటగడతాడు. ఒక్కొక్కప్పుడు తాను చిత్రించుతున్న వ్యక్తిని పూర్తిగా అర్థంచేసుకోలేడు. లేదా అతన్నిగురించి పూర్తిగా రచయితకు తెలియదు. అలాంటప్పుడు ఆవ్యక్తి చేస్తున్న పనిలోని విజయాలను వర్ణించు

తాడు. మానవహృదయాన్ని అర్థం చేసుకోడంకంటె తన రచన లోని కథానాయకుడుపనిచేసే యంత్రాన్ని అర్థంచేసుకోడం ఆ రచయితకు సులభం.

బూర్జువా ఫ్రాన్స్‌కు చెందిన ఆధునిక నవలలను చదువు తుంటే, ఒక కోణంద్వారానే పాత్రలను ప్రదర్శించుటద్వారా రచయితలు వాటిని యెలా నాశనంచేస్తున్నదీ మనకి స్పష్ట మవుతుంది. పూర్తి మనస్తత్వ పరిశీలనకోసం, ప్రేమను ఇతివృత్తంగా తీసుకుని రచించిన ఒక నవలను ఉదాహరణకు తీసు కోండి. నవలలో నాయకుడు, నాయిక, మరొకరు మామూ లుగా వుంటారు. మూడవ వ్యక్తిని మొదటిసారి చూసినప్పుడు కథానాయికకు కల్గిన భావాలను వివరంగా రచయిత వర్ణించు తాడు దానివల్ల నాయకుడు పడే బాధలనుకూడా వర్ణించు తాడు. కథానాయిక మూడోవ్యక్తితో వెళ్ళిపోతుంది. మళ్ళీ కథానాయకునివద్దకు తిరిగి వస్తుంది. మళ్ళీ ఆ మూడోవ్యక్తిని చూడాలని కోరుతుంది. మూడోవ్యక్తికి, యాదృచ్ఛికంగా కథానాయకునితో పరిచయం యేర్పడుతుంది. రచయిత వారిద్దరి మనోభావాలనూ వర్ణించుతాడు. చివరి అధ్యాయాలలో కథా నాయికకు ఒకకల వస్తుంది. ఆ కలనుగురించి కథానాయకునికి చెప్పనా, వద్దా అని రోజుల్లా ఆలోచించుతుంది. కథానాయిక చేతి మేజోడు (గ్లోవ్) తన డెస్క్‌లో వుండటం మూడోవ్యక్తి యాదృచ్ఛికంగా గమనించుతాడు. ఇతను ఉద్రేకపడుతాడు, పశ్చాత్తాపం చెందుతాడు. అంతేగాదు. కొంటె ఆనందాన్ని పొందుతాడు. అనిర్వచనీయమైన విసుపునూ చెందుతాడు. ఇవన్నీ ఒకేసారి అతని మనస్సులో రేగుతాయి. అంతటితో

సరి. చేతిమేజోడు విషయం వచ్చేసరికి పాఠకునికి విసుగెత్తుతుంది. ఆవేశంకొద్దీ పుస్తకాన్ని విసిరి పారవేస్తాను. అలా విసిరివేయడం ఆ పుస్తకం ప్రేమకు సంబంధించినదైనందువల్ల కాదు. ప్రేమ, స్పర్థలుకల ఇతివృత్తాలు (థీమ్స్) పాతబడిపోలేదు. అసూయను మనం అర్థం చేసుకోలేని ఉద్రేకం అని అనడానికి వీల్లేదు. పై మూడు పాత్రల భావాలను వివరంగా పరిశీలించడమూ కొత్తకాదు. కాని ఇలాంటివానిని ఫ్రెంచివాళ్ళు 'కోడిగ్రుడ్డుకు ఈకలు పీకడం' అనే మానసిక వ్యాయామం అంటారు. పోతే ఇక్కడ పైన చెప్పిన రచయిత చేస్తున్నదేమిటంటే, అసలు కోడుగ్రుడ్డు లేకపోయినా, దాని ఈకల్ని పీకడం. అందుచేత ఇలాంటి కథానాయకుణ్ణి, నాయకురాల్ని, మూడవ వ్యక్తిని పాఠకుడు అసలు నమ్మడు. రచయిత ఈ ముగ్గురి పరిసర వాతావరణాన్ని చెప్పలేదు. మూడవవ్యక్తి నివసించిన భవనాన్నిగురించి, డస్కులోని చేతిమేజోళ్ళనుగురించి వివరంగా వర్ణించాడు. కాని అతనివృత్తి ఏమిటో, చేతిమేజోడును గురించి అతడు ఆలోచించనిసమయంలో అతనుఏంచేస్తుంటాడో మొదలైనవి ఏవీ రచయిత తెలియజేయలేదు. అతను ఫామస్ బుల్ డాక్టరా? స్టాక్ బ్రోకరా? పార్లమెంటు సభ్యుడా? రచయిత చెప్పేవిధానంచూస్తే అతడు జర్నలిస్టుగా కనబడతాడు. కాని మనకు అతడు ఎక్కడ పనిచేసేదీ ఏమివ్రాసేదీ మొదలైన వేవీ తెలియజేయలేదు. ఒక ముసలావిడను అతని మేనల్లుడు చంపితే, ఆ శవాన్నిగురించి వ్రాస్తున్నాడో, అమెరికా ఉదారతనుగురించి వ్రాస్తున్నాడో ఏమీ తెలియదు.

కథానాయిక ప్రవర్తనకు ఆమె తలిదండ్రుల వైఖరి ఏమిటి ? రచయిత తెలియజేసిన ప్రకారం ఆమె తలిదండ్రులు కర్పూరపు ఉండల్నీ, తాళంకప్పల్నీ, నీతినియమాల్నీ పూజిస్తారు. అలాంటి తలిదండ్రులపట్ల ఆ కథానాయిక ధోరణి ఏమిటి ? సమాజంనుండి ప్రత్యేకంగా ఏరి తీసుకువచ్చిన పాత్రలేగాక, వాటి జీవితాల్నుండికూడా సంబంధం లేకుండా ఏరి తెచ్చిన పాత్రలు, ప్రత్యేకంగా ప్రేమకలాపాల్లోనే మునిగి వుండే పాత్రలు, వాస్తవికంగా వుండవు. పైన చెప్పిన మూడు పాత్రలూ మైనపు బొమ్మలు. వాటిని గురించి పాఠకుడు ఏమీ బాధపడడు. అతనికి విసువెత్తుతుంది వీళ్ళ గొడవకి.

జయప్రదం కాని సోవియటు నవలలో – నేనిదివరకే ప్రస్తావించిన నవలలో – (అయితే ఈనవల ప్రచురించబడలేదు) రచయిత, వెంటనే నాయికానాయకుల వృత్తిని బయట పెడతాడు. (సహజంగానే యిందులో మూడో వ్యక్తి లేడు.) కథానాయికా, నాయకులిద్దరూ ఒక ఉక్కు పరిశ్రమాగారం (ఫాంక్టరీ)లో పనిచేస్తారు. కథానాయిక మంచి సాహసంగల వ్యక్తి. నూతన విధానాలను కనిపెట్టే వారికి ప్రతిబింబం. కథానాయకుడు చిత్తశుద్ధి గలవాడేకాని, కొంత వెనుకంజ వేసేవాడు. 100 కి ఆరుపాళ్ళ ఖర్చును తగ్గించే కొత్త ఉత్పత్తి విధానాన్ని కథానాయిక ఆలోచించుతుంది. కథానాయకునికి అందులో విశ్వాసం లేదు. ఉత్పత్తి విషయమై చర్చించి సమావేశాన్ని రచయిత వివరంగా వర్ణించుతాడు. కథానాయిక చొరవను ఒక ముసలి ఫోర్మన్ ప్రశంసించుతాడు. నిరాశావాదమైన ఇంజనీర్ మాత్రం, ఈ కొత్తపద్ధతి సరియైనదేనా అని

సందేహించుతాడు. రాజధానీ నగరంనుండి ఒక ఉపసంఘం వస్తుంది. ప్రాంతీయ కమిటీ ఒక సమావేశం జరుపుతుంది. చివరకు కథానాయిక కొత్తపద్ధతిని అంగీకరించుతారు – ఇవన్నీ రచయిత వివరంగా వర్ణించుతాడు. ఈ ఘటనలతో ఉత్సాహ పడిన కథానాయకుడు, కథానాయికను అభినందించుతాడు. కథానాయిక సిగ్గుపడుతూ ఇలా అన్నట్లు రచయిత తెలియ జేస్తాడు.

"గ్రీషా! మనం ఇంకా కొంత కష్టపడి పనిచేయాలి." తర్వాత అధ్యాయంలో, వీరిద్దరూ తమ వంతుపనిని పూర్తి చేయడమేగాక ఇంకా ఎక్కువకూడా చేస్తారు. రెండో విషయం వీరికో కొడుకు పుడతాడు.

ఈ కథానాయికా-నాయకులిద్దరూ మొదట ప్రేమించు కొంటారు. కథానాయిక సూచించిన నూతన ఉత్పత్తి విధా నంపై విభేదాలు సమసిపోగానే, వారిద్దరూ పెళ్ళిచేసుకొం టారు.

కార్మికసమస్యలకు సంబంధించిన ఇతివృత్తాన్ని (థీమ్) తీసు కోడం చాలా బాధ్యతాయుతమైనపని. పైగా కొత్త ఇతివృత్తం కూడా. పెట్టుబడిదారీ సమాజంలో కార్మికులను పీడగా చూస్తారు. రోజూ పనిచేసే గంటలు తగ్గించాలని ఆశించే స్వాప్ని కులుగా మాత్రమే వారిని అక్కడ చూస్తారు. మనసమాజంలో శ్రమను హర్షించుతారు. నిర్మాణాత్మక కృషిగా ఎంచుతారు. పనిచేయడం తమ జీవితంలో ఒక నిరుత్సాహకరమైన విష యంగా చూసే పాత్రలతో మన సమాజాన్ని చిత్రించే నవల లను మనం ఊహించలేము. అందుచేత పైన నేను చెప్పిన నవలా

కారుని తప్పులు ఉక్కు-ఫౌండరీని, నూతన పద్ధతులను, నాయకీ నాయకుల అభిప్రాయ భేదాలను వర్ణించడంవల్ల కలగలేదు. అదంతా వర్ణించాల్సిందే.

కాని రచయిత తన పాత్రలను, వాటి వ్యక్తిగత జీవితాల నుంచి దూరంచేశాడు. కథానాయకునికి నాయిక పట్లగల ప్రేమను ఏదో యథాలాపంగా సూచిస్తాడు. ఒక అధ్యాయంలో నూతనంగా జనించిన శిశువు ఏడుపును మనం హఠాత్తుగా గమనించుతాం. నిష్కపటంగా చెప్పాలంటే ఆ నవలలో మనల్ని కొద్దిగా విభ్రాంతుల్ని చేస్తుంది ఈ శిశు ఆక్రందన. తన పాత్రలను ఔన్నత్యానికి కొనిపోతున్నానని రచయిత భావించాడు. వాస్తవానికి అతడా పాత్రలను కొంచపరిచాడు. ఆ పాత్రలలో గంభీరత, క్లిష్టభావాలు లేకుండా చేశాడు. ఉద్వేగ భావాన్ని సంపూర్ణంగా అభివృద్ధిచేయ లేదుకూడా.

అలాంటి నవలలు ప్రచురితమయ్యాయి. కొన్ని అనేక ముద్రణలుకూడా వెలువడినాయి.

బొగ్గు, ఉక్కు, కాలికో మొదలైన విషయాలను చర్చించే వృత్తిన విగ్రహాల పాత్రలను నటకులు ధరించవలసి వచ్చే నాటకాలుకూడా కొన్నివున్నాయి. అలాంటి నాటకాలను (నీచంగా) క్రిందిచూపు చూచేవారు ప్రేక్షకులు (ప్రేక్షకుల స్థానాలు రంగస్థలంకంటె క్రిందిగావున్నప్పటికీ). ఆ రంగంలో ప్రదర్శించబడిన ప్రజలను అనాగరిక (ప్రిమిటివ్) ప్రజలుగా ఎంచేవారు.

సోవియట్ ప్రభుత్వంఏర్పడిన 35 ఏండ్ల యీ కాలంలో మన అత్యుత్తమ రచయితలు, అనేక సజీవ పాత్రలను నూతన

సమాజంకోసం పోరాడినవారినీ, లేక ఆ సమాజాన్ని నిర్మించు టలో తోడ్పడినవారినీ సృష్టించారు. మన సమకాలికులను - వారి ఆంతరంగిక ప్రపంచం చుట్టూ ఒక పరిధిచుట్టి-చిత్రించిన నవలలు, చిన్న కథలూ అనేకం ఎందువలన ఉంటున్నాయి ?

ఈ తప్పుకు కొంతవరకు బాధ్యత కొందరు విమర్శకుల, సమీక్షాకారుల, సంపాదకుల (దురదృష్టవశాత్తు అనేకమంది) పైన వుంది. ఒకపాత్రను సరళంగా సృష్టించడం అంటే, అతనిని ఆకాశానికి ఎత్తాలనేవారు. ఇతివృత్తాన్ని లోతుగాను, విశదం గాను వర్ణించితే దానిని నిందించేవారు. ఇప్పటిదాకా వారికి ఇది అలవాటయింది.

మన పత్రికలు ప్రేమకవితను చాలా సంవత్సరాలుగా దాదాపు అచ్చువేయలేదనే చెప్పవచ్చు. బాలబాలికలు పెరి గారు. వయస్కులయ్యారు. ప్రేమించుకొన్నారు. బాధలు పడ్డారు. సుఖాన్ని పొందారు. కాని ఇవి కవితలో ప్రతిబింబించ లేదు. పునర్నిర్మాణ సమయంలో, వీరోచితకృషి జరుగుతున్న సమయంలో మరో ఇతివృత్తాలకు తావులేదని మీా రనవచ్చు.

"దానినిగురించి" ("About that") అనే కవితను మయకొవస్కీ వ్రాసినప్పుడు అదేమంత సాధారణ సమయం కాదు. ప్రేమ ఇతివృత్తాన్నికూడా ఉన్నతస్థాయికి కొనిపో వచ్చుననీ, భవిష్యత్ను గురించి కనే కలలతో దానిని జోడించ వచ్చుననీ మయకొవస్కీ నిరూపించాడు.

మన ప్రచురణాలయాలు, పత్రికలు గేయకవితను (లిరి సిజమ్) వదలి వేసినపుడు మన రేడియో తరుచుగా పుష్కిన్, లెర్మాంటివ్ల ప్రేమకవిత్వంనుండి, ఎ. కె. టాల్స్టాయ్, ఫెట్,

రాబర్ట్ గ్రేవ్స్ గేయాలను తీసుకొని ప్రసారం చేయడం గమనించ వలసిన విషయం. రాబర్ట్ గ్రేవ్స్ గేయాలలోనేగాని ఆధునిక కవితలో తమ మనోభావాలను మన ప్రేమికులు ఎందుకు చూడలేక పోయారు? ఇలా నేనింకా ప్రశ్నించుకుంటూ పోవచ్చు. మన చిన్న కథలలో ప్రేమికుల తగాదాలుగాని, కుటుంబ కలహాంగాని, వ్యాధిగాని, బంధు మరణంగాని, చెడ్డ వాతావరణంగాని అరుదుగా కన్పించుతారేం? ("మంచి వేసవి రోజున", "మే లో సుగంధ మారుతం వీచే సాయంత్రాన" "ఆకురాలుకాలంలో వినీల ప్రభాతాన" ఇలా సాధారణంగా మొదలౌతాయి వర్ణనలు.)

భగ్నప్రేమ, ప్రేమించిన వ్యక్తులను కోల్పోవడం మొదలైన విషయాలను వర్ణించడం పనికిరాదనీ, మన ప్రజల వీరోచితకృత్యాలను, తాత్వికంగా భవిష్యత్తులో మనకుండే ఆశావాదాన్ని మాత్రమే వర్ణించాలనీ, ఇప్పటికీ కొంతమంది విమర్శకులు అమాయకంగా భావిస్తున్నారు.

నూతన సమాజ ప్రజలను, నిజమైన ప్రజలను, క్లిష్టమైన, సంపదవంతమైన పరిపూర్ణమైన జీవితం కొనసాగించే ప్రజలను, (అంతేగాని బాహ్యస్వరూపం మాత్రం కన్పడే [స్కీమెటిక్] వ్యక్తులనుగాదు) చిత్రించవలసిన కఠినమైన బాధ్యత మనపై బడింది. కఠినమైనదైనా ఈ బాధ్యత మహత్తరమైనది.

# 12

రచయిత శిల్పాన్ని గురించి చెప్పేటప్పుడు తరచుగా నేను గత కాలపు రచయితలను పేర్కొన్నాను. వారినుండి మనం నేర్చుకోవలసిందేమిటి? దీనికి సమాధానం సహజంగా

ఇదే. సంపదవంతమైన అమలినభాష, వాక్యనిర్మాణం, సాహిత్య విధానాలు.

ప్రామాణిక రచయితలనుంచి యిదంతా నేర్చుకో వలసిందే. వార్తాపత్రికలలోని దరిద్రభాషతో నవలలను వ్రాయ వలసిన పనిలేదు. టాల్‌స్టాయ్‌నుంచి వ్యక్తి చిత్రీకరణను (Painting of a Portrait) నేర్చుకోవాలి. నవలలో ప్రకృతిని ("లాండ్ స్కేప్") కళ్ళకు కట్టినట్లు చిత్రించగలిగిన శక్తిని తుర్గెనెవ్‌నుండి నేర్చుకోవాలి. మితంగా మాట్లాడినా చక్కగా వ్యక్తం చేయగల సాధనాలు చెకోవ్ కున్నాయి. అది ఆయన ప్రత్యేకత. ఆయననుంచి నేర్చుకోవలసిన విషయం అది. అసలు విషయాలకు సంబంధించని ఉపకథలను లయబద్ధంగా వర్ణించడంలో గొగోల్ ప్రతిభను మనం అలవరచుకోవాలి. లెర్మాన్‌టోవ్ వచనంలో విపులమైన స్పష్టీకరణ, కవితను మనం నేర్చుకోవాలి. ఇలాగే ఇంకా చెప్పవచ్చు.

మరొకరినుండి నేర్చుకోవడం అంటే, వారిని అనుసరించడం అనికాదు. నూతన కథావస్తువుకు నూతన రూపాలు అవసరమని నా భావన. 19వ శతాబ్దంలోని నవలలో, వ్యక్తుల, లేక కుటుంబాల చిత్రీకరణ మాత్రమే వుండేది. ఆ నవలలో రచయిత తన పాత్రలను ఒక కథానాయకుని లేక అనేక కథానాయకులచుట్టూ, గుమిగూర్చేవాడు. నేటి ప్రజాజీవితం, ఒక వ్యక్తి ఆంతరంగిక జీవితంలో ఒక భాగమే. కథానాయకుడు లేక కథానాయకులతో సంబంధంవుండే అనేకమంది ప్రజలను చిత్రించకుండా, నేఁడు ఒకనవలను – అది మన స్వత్వం చిత్రించే నవలైనాసరే–వ్రాయడం అనూహ్యమైన విషయం.

నవలా నిర్మాణంలో తప్పకుండా ఈ విషయం పనిచే స్తుంది. జీవిత పద్ధతికూడా మారింది. పెద్దపెద్ద వర్ణనలతో నిరంతరం పాఠకుల్ని నిలబెట్టే ఘటనలను ఆధునిక నవలలో ఉండటం నేనూహించలేను. తుర్గెనివ్‌కు అలా వర్ణించడం సహజమే. కాని నేడు అది తెచ్చిపెట్టుకొన్నట్లుగా కన్పడుతుంది.

ప్రామాణిక రచయితలనుండి మనం నేర్చుకోవలసిన విషయం వేరేవుంది. ప్రజలను చిత్రించడంలో ఆ రచయితలు అనుసరించిన పద్ధతులను మనం నేర్చుకోవాలి.

అది యిప్పుడు అసాధ్యం అనీ, ఇపుడు పరిస్థితి పూర్తిగా మారిపోయిందనీ మీరు అసమ్మతి తెలియజేయవచ్చు.

నిజమే. సోవియటు రచయితలు 19 వ శతాబ్దం నాటి రచయితలవంటివారు కారు. అతని మనస్తత్వం నేడు వేరుగా వుంటుంది; అతడు వేరుగా అవగాహన చేసుకొనేది చాలా వున్నది. నేటి సోవియట్ రచయిత చిత్రించే ప్రజలు ప్రామాణిక సాహిత్యంలోని పాత్రలవంటి వారుకారు. పూష్కిన్, లెవిన్‌ల లాగా నేటి రచనలలోని పాత్రలు తర్కించవు. చెకోవ్ పాత్ర ట్రోఫిమోవ్ లాగా పనిచేయవు. "ముగ్గురు సోదరీమణులు" లాంటి చెకోవ్ రచనలోని కథానాయికలలాగా ప్రేమించవు.

తమ పాత్రలను చిత్రించేటప్పుడు వారిని గురించి తాము చూచినది మాత్రమే వర్ణించి వూరుకొనేవారుకాదు 19 వ శతాబ్దపు మహా రచయితలు. కాలదేవతకు వేసిన ముసుగును తొలగించి భవిష్యత్తులోకి చూచేవారు. అయితే వారికి సమాజాభివృద్ధికి చెందిన శాస్త్రీయ సిద్ధాంతం తెలియదు. కాని నేటి యువరచయిత ఎవరికైనా ఆవిషయం తెలుసు.

పూర్వరచయితలు ఎక్కువగా ఊహించవలసి వచ్చేది. అందు చేత తరచు తప్పులుకూడా చేసేవారు. వారి తాత్విక సిద్ధాంతాలు, సామాజిక అభిప్రాయాలు అమాయకంగా, పరిమితంగా, ఒకొక్కప్పుడు అబద్ధంగా కన్పించేవి. మానవ సంబంధాల అభివృద్ధి ధోరణిని సోవియట్ రచయితలు నిర్ణయించగలరు; అభ్యుదయకరమైన మనోభావాలను, తప్పక నాశనం అయ్యే భావాలను వారెరుగుదురు.

రచయితల శిల్పం గురించి మాట్లాడేటప్పుడు తరుచుగా, నేను మన ప్రాచీన రచయితలను పేర్కొంటాను. అందుకు కారణం ఇది :

తమ సమకాలికులను వారు చెప్పలేనంత బాగా, నిశితంగా అవలోకించారు. కళలోని వాస్తవికత, మానవుని గాఢంగా అర్థం చేసుకోవడం, సజీవ మానవవ్యక్తిగా పాత్రలను చిత్రీకరించగల్గిన శక్తి, మొదలైన వాటిని వారినుండీ మనం నేర్చుకోవాలి.

బూర్జువాసమాజంలో వాస్తవికతకు కళకు మధ్య ఎప్పుడూ అఘాతం వుంటుంది. బూర్జువా యువకుడు ఒకసారి ఒక పేదఅమ్మాయిని పెళ్ళి చేసుకోవాలని తలచాడనుకోండి. లేదా వర్తకానికి బదులుగా కళాసృష్టి చేయాలని తలచాడనుకోండి. లేదా లాభసాటి బేరం కాని గౌరవవృత్తిని ఏదైనా చేపట్టాడనుకోండి. వెంటనే అతని తండ్రి చిరాకుగా "జీవితం ఏమీ నవల కాదు" అని అంటాడు.

ఫ్లాబర్ట్ వ్రాసిన "మదాంబొవారీ" అశ్లీలానికి అసమ్మతి తెల్పిన దెవరు? వ్యభిచార గృహాలకు వెళ్ళుతూ, ఉంపుడు

కత్తెలను ఉంచుకోడం ఒక ఫాషన్ అని అనుకొనే అదే పెట్టు బడిదారులు, బ్రొట్టిసెల్లీ చిత్రాలు యువకులను అవినీతిపాలు చేస్తున్నాయని, వాటిని తీసివేయవలసిందని ఇటలీలో కోరిం దెవరు? బూతు ప్రచురణలనుకొనే అవినీతిపరులే. చాప్లిన్ ఫిల్ములను అవినీతికరమైనవని అమెరికాలో ఆక్రోశించేదెవరు? ఉన్నతాధికారాలలోవుండి, ఆ అధికారాలతో రక్షణ పొందు తున్న పెద్ద పెద్ద దొంగలూ, బందిపోటు దొంగలూ, తుచ్ఛ మైన పనులద్వారా లక్షలాది ధనం సంపాదించే వాళ్ళూ.

బూర్జువా వర్గానికి నీతి నియమాల విషయాలపై తమ కొకటీ ఇతరులకు మరొకటీ ప్రమాణాలుంటాయి. మామూ లుగాఉండే పది ధర్మాలుగాక బూర్జువావర్గం పదకొండో ధర్మం ఒకటి తెచ్చిపెట్టింది. (క్రైస్తవ మత ప్రకారం పది ముఖ్య ధర్మాలున్నాయి - అను.) అది: "ధనాన్ని గౌర వించండి" అని. వారికి సంబంధించినంతవరకు ఈ పదకొండవ ధర్మాన్నిమాత్రం తమకు అట్టిపెట్టు కొంటారు. నీతి నియమా లకు వారు అతీతులు. వారు దొంగతనం చేయవచ్చు. అబద్ధం ఆడవచ్చు. నైతికంగా దిగజారిన జీవితం కొనసాగించవచ్చు. హత్య చేయవచ్చు.

తమ కొకటి ఇతరులకు మరొకటీ నైతిక ప్రమాణాలు ఉండాలనే పద్ధతిని పోషలిస్టు సమాజం ఖండించుతూంది.

మర్యాదగా బ్రతకాలని మాటాడుతూనే దొంగతనం చేసేవారు, ఆత్మవిమర్శ కావాలని చెబుతూ చిన్న నియంతల లాగే వర్తించేవారూ, సత్యాన్ని ప్రేమించుతామని చెబుతూ అపవాదులు వేసేవారూ, మాకూ వున్నారు. అయితే ఇలాంటి

వారు చాలా తక్కువ. ఇలాంటివారిని ఎదుర్కొని మా సమాజం పోరాడుతోంది. మా ప్రజలలో ఏ ఒక్క భాగమూ మా దేశంలో ఏ గౌరవనీయుడూ, పైన చెప్పిన రెండు రకాల నైతిక ప్రమాణాన్ని కోరరు. ప్రజలను మోసంచేసే కళలో మా ప్రజలకు అభిరుచి లేదు.

జీవితం నవల లాంటిది, నవల జీవితం లాంటిదని మా ప్రజలు భావించుతారు. తన పాత్రలను నిజమైన ప్రజలుగా చిత్రించనందుకు ఒక రచయితను సోవియట్ పాఠకులు తప్పు బట్టారంటే, అది కొంత ఆలోచించవలసిన విషయమే.

నాకు వచ్చిన ఉత్తరాలలో లెనిన్‌గ్రాడ్ ఇంజనీర్ వ్రాసింది మొదటిదికాదు. సాహిత్యంలో జీవితం గాఢంగా, వాస్తవికంగా ప్రతిబింబించాలని పాఠకులు తరచుగా నాకు జాబులు వ్రాస్తూవుంటారు. (ఇతర రచయితలకుకూడా ఇలాంటి వుత్తరాలు వస్తాయని నాకు తెలుసు.) సాధారణ ప్రజలను, –నిజానికి వారు సాధారణ ప్రజలు కాదు – మానవుని అంతఃకరణాభివృద్ధికి (స్పిరిట్యుయల్ డెవలప్‌మెంట్) సంబంధించిన కష్టాలను, అభివృద్ధికీ గతకాలపు అవసాన చిహ్నాలకూ మధ్యగల వైరుధ్యాలనూ, హృదయపూర్వకంగా సంపూర్ణంగా వాస్తవిక జీవితంలోవలె చిత్రించాలని రచయితలను పాఠకలోకం కోరుతుంది. దైనందిన జీవిత శౌర్యాన్ని చిత్రించాలని పాఠకలోకం వాంఛిస్తూంది. అసత్య ఆవేశానికి లోనుగావడం మన ప్రజల విలక్షణంకాదు. అలాంటి అసత్యావేశం లేకుండా మన శక సంరంభాన్ని చిత్రించాలని వారు కోరుతున్నారు. అతిశయోక్తులంటే మన ప్రజలకు నిరుత్సాహం కల్గుతుంది. అందుచే అవి

లేకుండా సోవియట్ స్త్రీ, పురుషులస్వభావాన్ని చూపించాలని పాఠకులు కోరుతున్నారు. ఔన్నత్యం అంటే పోటీలుపెట్టి నిల బెట్టిన గడ కాదు. అలాగే చిత్తశుద్ధిలేకుండా పటాటోపంవల్ల లాభంలేదు. అందుచే కపట ఔన్నత్యాన్ని, చిత్తశుద్ధిలేని పటాటోపాన్ని వర్ణించవలదని రచయితలను మన పాఠకులు కోరుతున్నారు.

మన రచయితలంతా ఆదర్శవంతమైన ప్రజనే చిత్రించా లని కొందరు విమర్శకులు అభిప్రాయపడుతున్నారు. ఆధునిక బూర్జువా నవలలోని పాత్రలు పైకి సంస్కారం కలిగినట్లు కన్పించుతాయి. కాని అంతర్ముఖంగా చూస్తే పశుస్వభావికులు, కొంతవరకు మిధ్యావాదులు, జూదగాళ్ళు, మోసగాళ్లు, హేమ్లెట్ పాత్రలాంటివాళ్ళు. ఇలాంటివారికన్న నేటి సోవియట్ పౌరుడు ఎంతో ఉన్నతవ్యక్తి, ఉదాత్త ఆత్మగలవాడు, ఎంతో క్లిష్ట స్వభావం గలవాడు. మన జీవితాన్ని వాస్తవికరూపంలో చూపించి నట్లయితే ఆ అద్భుతప్రజలను చిత్రించే పుస్తకాలు మనకులభ్యమవుతాయి. సాధారణ సోవియట్ పౌరుని తీసుకోండి. అతనిలో సుగుణాలూ ఉంటాయి. తప్పులూ వుంటాయి. గత కాలంలోని అభ్యుదయవాదులు తాము సాధించలేమని భావించిన ఆదర్శ సమాజాన్ని నేడు నిర్మించుతున్న దెవరు? అందరికీ ఆదర్శవంతులైన అసాధారణ ప్రజలు కాదు. మామూలు మానవమాత్రులే.

లెనిన్‌గ్రాడ్ ఇంజనీర్ పేర్కొన్న నవలలో పాత్రలలో తప్పులుండవు. ఆ పాత్రలన్నీ మెరుగులు దిద్దితీర్చినవి. వాటికి తమ పోర్షన్ అంతా కంఠతా వచ్చు. ఒకవేళ ఆ పాత్ర మరచి

పోయినా, రచయిత సరియైన ప్రాంప్టింగ్ (క్యూ, నాటకంలోని
సంభాషణలో ఆఖరిభాగం) ఇస్తాడు. అలాంటి పాత్రలు
ఒక్క విషయంలో మినహా అంతా మంచివే. అదేమిటంటే,
పాఠకుడు ఆ పాత్రలు వాస్తవమని నమ్మడు.

ఇప్పుడు తరచుగా: "మాకు దుష్ట (నెగెటివ్) పాత్రలను
ఈయకండి" అనడం మామూలు అయింది. శిష్ట (పాజిటివ్)
పాత్రలను ఆదర్శవంతంగా చిత్రించాలని కోరే విమర్శకులే
ఈ విషయం అంటుంటారు.

బలహీనతలుగాని, తప్పులుగాని లేకుండా ఒక అద్భుత
మైన వ్యక్తి చిత్రాన్ని ఒక రచయిత సమకూర్చుతాడనుకోండి.
అతనితోపాటు ఒక బద్ధకస్తునీ, దగాకోరునూ నిజమైన మానవ
స్వభావాలతో కూడిన వ్యక్తినీ చిత్రించుతాడనుకోండి. అప్పుడు
పరిపూర్ణమై రక్తమాంసాలతో నిండిన ఈ దుష్టపాత్రకు అధి
క్యత రాదా? ఒక కోణంద్వారామాత్రమే ప్రసరించబడి
ముఖంమాత్రం కాంతివంతంచేయబడిన ఆదర్శపాత్ర, తన
నీడనుకూడ ప్రసారించక పై దుష్ట పాత్రచే వెనక్కి నెట్టివేయ
బడదా? ష్టోల్జ్ పాత్రను మచ్చలేని దానినిగా చేయాలని
గోంచరోవ్ తలిచాడు. కాని అది వాస్తవిక పాత్రలాగా లేదు.
కాని ఆబ్లోమోవ్ పాత్ర సజీవంగావుంది. ఒక పాతికేళ్ళక్రితం
నేను వ్రాసిన నవలలో నేనుకూడా విఫలమయ్యాను. దుష్ట
పాత్రలు చాలా వాస్తవికంగా వున్నాయి. శిష్టపాత్రలకు నేను
అన్నివిధాలా సద్గుణాలనూ, సత్ స్వభావాలనూ అంటగట్టినా
వాటికంటే దుష్టపాత్రలే వాస్తవికంగా ఉన్నాయి. ఇతర

ఆధునిక రచయితలు కూడా ఇలాంటి అపజయాలనే అనుభవించారు.

సోవియట్ రచయితలు సాహిత్యాన్ని గాఢంగా ప్రేమించుతారు. ఈ సాహిత్యంలోని లోపాలకు మనసారా విచారించుతారు. విజయాలకు సంతోషించుతారు. వారు మన సమాజంలో వివిధోన్ముఖమై సంపదవంతమైన జీవితాన్ని చూస్తున్నారు. అందుచేత మననవలలో కొన్ని వాస్తవిక జీవితాన్ని చూపించలేక పోతున్నాయనీ, అతిచులకన చేస్తున్నాయనీ, సాంప్రదాయ ధోరణిలో వుంటున్నాయనీ పాఠకులు గ్రహించుతున్నారు. తమ కామ్రేడ్స్‌ను, తమ సమకాలికులను, తమను నవలలలో చిత్రించాలని వారు కోరుతున్నారు. వారేమీ తమను ఆదర్శపురుషులుగా చిత్రించమని కోరడంలేదు. సజీవ ప్రజలుగా చిత్రించాలని కోరుతున్నారు. టాల్‌స్టాయ్, చెకోవ్, గోర్కీల ప్రామాణిక గ్రంథాలను తిరిగి తిరిగి చదువుతూంటేవిప్లవ రష్యాలోని ప్రజలను ఎంతసూక్ష్మదృష్టితో, ఎంతచాకచక్యంతో, ఎంత చైతన్యంతో చిత్రించారో మనకు బోధపడుతుంది. సాధారణ ప్రజలు - వారి ఆంతరంగిక ప్రపంచం ఎప్పుడూ సాధారణమైనదిమాత్రం కాదు-సోవియట్ నవలలలో తమకు స్థానం ఉండాలని నిత్యం కోరుతున్నారు.

## 13

రొమాంటిసిజంతో నిండిన మంచి పుస్తకాలున్నాయని నాకు తెలుసు. నిర్జీవమైన, పోటీలుపెట్టి నిలబెట్టిన, ఒక మచ్చ కూడా లేనిపాత్రలతో నిండి సర్వగుణ సంపన్నమైన, రూళ్ళ

కర్ర న్గోరణిలో వ్రాసిన (స్కీ—మోఃకిక్) పుస్తకాలూ్ లో వీటిని మేళవించి గందరగోళం చేయడంలేదు. (రొమాంటిక్ అంటే గత శతాబ్దంలోని మొదటి అర్థభాగంలో వచ్చిన సాహిత్య ఉద్యమం అని నా అభిప్రాయంకాదు. మామూలుగా అందరూ వాడిన అర్థంలో, అనగా రసోద్రేకత అనేభావం నేను వాడు తున్నాను.)

దేశానికి భాస్వరం అవసరం అయినట్లుగానే మనస్సుకు రొమాన్స్ కావలసిన కాలంవుంటుంది. పుష్కిన్ గాథ అభి ప్రాయాలను వారికి తెలియజెప్పేవరకు యువకులు లెర్మాంటివ్ రచనల ప్రవాహంలో కొట్టుకొనిపోవడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. "యంగ్ గార్డ్" అనే నవలలోని దళసభ్యునికి "డెమన్" అనేది అభిమాన పద్యం కావడంలో ఆశ్చర్యంలేదు. జోరీగ (Gadfly) అనేదానిని అంతశ్రద్ధగా అనేక తరాలవారు చదు వుతూ వుండటంకూడా ఏమంత ఆశ్చర్యకరమైన విషయం కాదు. అనేకమంది ఇతర ప్రసిద్ధ రచయితల పుస్తకాలలో కన్నా, నికోలై ఆస్ట్రోవ్‌స్కీ నవలలో, మన దేశ యువకులకే గాక విదేశాల యువకులకు సైతం వారి యువజనాత్మ ప్రతి బింబించేది.

రొమాంటిక్ నవలలపట్ల యువకులేగాదు ఆకర్షించ బడేది. పదాడంబరం, అసహజ పరిస్థితులు, అతిశయోక్తుల పుట్టలతో నిండిన హ్యూగోను ఎన్నడో రసపిపాసులు పాతి పెట్టారు. కాని గత సంవత్సరం హ్యూగో వర్థంతి జరిగినప్పుడు హ్యూగో రచనలు యింకా బాగా వ్యాప్తిలో వున్నాయనీ, అతని రచనలను ప్రతిచోటా చదువుతున్నారనీ తెలియ

వచ్చింది. పాత రష్యన్ సాహిత్యం తీసుకొంటే, 'తారాస్ బుల్బా', 'ది పోర్ట్రియిట్', 'ఆస్యా' మొదలైన వున్నాయి. అలాగే గోర్కీ మొదట్లో వ్రాసిన కథ లున్నాయి. ఇక ఈనాడు చూస్తే, కావెరిన్, పాస్టొవ్స్కీ, కజకెవిచ్ మొదలైనవారి పుస్తకాలను అన్నితరాల పాఠకులు ఆనందంగా చదువుతున్నారు. "యంగ్ గార్డ్" చదువుతూ వయోవృద్ధులైన వారు కూడా కన్నీళ్లు పెట్టిన వారిని నే నెరుగుదును.

మానవ స్వభావంలోని ఉత్తమ భాగం కేంద్రీకరించబడిన పాత్రలను ప్రదర్శించడం, రొమాంటిక్ ఇతివృత్తాన్ని చిత్రించే రచయితకు సాధ్యపడుతుంది. తాను ఎన్నుకొన్న పాత్ర స్వభావాలపై రచయిత దీపకాంతి ప్రసరింపచేస్తాడు. దీని వల్ల పాత్రలలోని లక్షణాల నిష్పత్తి బాగా మారుతుంది. రొమాంటిక్ నవలలోని పాత్రలు నిజమైనవేనని మనం నమ్మడానికి కారణం అవి నీతిబోధకై ఉద్దేశింపబడిన వాటివలెగాక భావనాసౌందర్యం కల్గియుండడమే. ఈ రచయిత నీతిబోధలు సాగించడు. పాత్రను ఔన్నత్యానికి కొనిపోతాడు. దూరాన్ని, ఔన్నత్యాన్ని బయటపెడతాడు.

ఫ్రెంచి స్కూలుపిల్లలకి ప్రతియేటా పరీక్షలలో ఈ క్రింది ప్రశ్నలలాంటివి వస్తూవుంటాయి. "ప్రజలును ఉన్నదున్నట్లు చిత్రించిన రాసైన్‌ను, ప్రజలు ఎలావుండాలో చిత్రించిన కార్నిల్లీతో పోల్చి చెప్పండి." ఒక కుర్రాడు ఇలా సమాధానం వ్రాశాడు. "కార్నిల్లీకంటె రాసైనే మనకు దగ్గరవాడు. అతడు ప్రజల మనోభావాలను యథాతథంగా చిత్రించాడు." మరొక కుర్రాడు ఇలా వ్రాశాడు : "కార్నిల్లీ నిస్సందేహంగా

రాసైన్‌కంటె గొప్పవాడు. నీతి, శౌర్యం, ఉన్నత మనో భావాలు, పతనావస్థకు దారితీసే బలహీనతలన్నీ జయించడం మొదలైన సద్గుణాలు కల్గిన ప్రజలను, ప్రజలు ఎలాఉండాలో అలాంటి ప్రజలను, చిత్రించిన కార్నెల్లియే గొప్పవాడు."

రొమాంటిక్ కవుల, వాస్తవికతావాదుల, యథాతథ వాదుల (నాచురలిస్టుల) అధివాస్తవికుల, నూతన వాస్తవిక వాదుల తీవ్ర ప్రకటనలు వెలువడకముందే, పాత్ర చిత్రీకరణ పద్ధతిలో విభేదాలు వుండేవి.

కళలో స్వప్నాలు, వాస్తవికతగురించి పాశ్చాత్య దేశా లలో నేడూ వాదవివాదాలు కొనసాగుతున్నాయి. అలాంటి వాదనలు మన ప్రజల్నిగాని, మన పాఠకుల్నిగాని కద ల్చడంలేదు, సోషలిస్టు వాస్తవికతావాదం వొక సాహిత్య ధోరణి కాదు. అనేక విభిన్న సాహిత్యప్రక్రియలను అది అను మతించుతుంది: ఆంటనోవ్ చిన్నకథ "వర్షం" అంటే నాకిష్టం. చిత్తశుద్ధితోను, కరుణార్ద్ర స్వభావంతో అది నిండివుంది. చెకోవ్ సైతం ఈ కథకు తలయూపి వుండేవాడు.

కజకెవిచ్ వ్రాసిన రొమాంటిక్ నవల "నక్షత్రం" (స్టార్) ను నేను హర్షించడానికి ఇదేమీ అడ్డురాలేదు. "ఇద్దరు యోధులు", "పంటసిరి" (హార్వెస్టు) మొదలైన నవలలలోని పాత్రలు విభిన్నపద్ధతులలో చిత్రించబడినాయి. "దళం" (ది నైంటీన్) లో ఫెడయెవ్ పాత్రలను సాధ్యమైనంత సహజం గానూ, వినయంగానూ చిత్రించాడు. "ది యంగ్ గార్డ్"లో పాత్రలను రొమాంటిసిజం అనే కాంతితో వెలిగించాడు. పై రెండుగ్రంథాలూ విజయం పొందినవే.

త్రేస్సిన్, గాఢ వాంఛకల్గిన, నైతికంగా పతనమయిన ఫ్రెడ్రిన్ చిత్రించాడు. కార్మిల్లి సృష్టించిన పాత్ర హారేస్. పాతకాలపు కఠినమైన వ్యక్తి ఈ పాత్ర. హారేస్‌కు భిన్నమైన ప్రపంచంలో ఫ్రెడ్రీ నివసించుతూంది. 19వ శతాబ్దంలోని రొమాంటిసిస్టులు తమ పాఠకులను పర్వతశిఖరాలకు కొని పోయేవారు. యథాతథవాదులు (నాచురలిస్టులు) ఎక్కడో భూమి అడుగున లోతుగా పాఠకులను కూర్చోబెట్టేవారు. "లా మిజరబులే"లో జావెర్ట్‌లాంటి ఉదాత్త స్వభావుడైన పోలీసూ, ఫ్లాబర్ట్ వ్రాసిన డాక్టరు బోవారీలాంటి దయార్ద్ర హృదయ వ్యక్తులూ ఒకే ప్రపంచంలో ఉండజాలరు. అయితే ఈ రెండు నవలలూకూడా దాదాపు ఒకే కాలంలో వ్రాయబడినాయి. వాస్తవంగా లేనిమనిషిని హ్యూగో సృష్టించాడు. నిజంగా చూడవలసినదంతా తన పాత్రలో చూపడానికి ఫ్లాబర్ట్‌కు ఇష్టంలేదు.

"స్టాలిన్‌గ్రాడ్ యుద్ధ కందకాలలో", "నక్షత్రం" అన్న నవలలు రెండూ రెండు రకాలు. వీటి రెండింటికీ గల విభేదం ఏమిటి? ఇతివృత్తంలో కాదు. స్టాలిన్‌గ్రాడ్ యుద్ధంలోవలెనే శత్రుశ్రేణుల వెనుకకూడా శౌర్యం చిత్రించవలసిన విషయమే.

"నక్షత్రం"లోని కథానాయకుడు, నెక్రసావ్ నవలలోని శాపన్లు మానసికంగాగాని, భావాలలోగాని విభేదంకల పాత్రలు కావు. వారు ఒకేరకంగా యుద్ధకందంలో కూర్చొని వుండగా నేను ఊహించగలను. వారు ఒకరినొకరు అర్థంచేసుకోగలరు. జీవితంలో ఒకే ప్రయోజనంకల వ్యక్తులు వారు. అయితే రచయితలు వారిని విభిన్న మార్గాలలో సృష్టించారు. అంత

మాత్రాన రెండు ప్రపంచాలుగా పీసు విభజింపబడలేదు. కళలో భిన్నస్వరూపమే అది.

పాత్ర చిత్రీకరణలో రొమాంటిక్ స్వభావాన్ని కొందరు విమర్శకులు ఖండించిన విషయం నాకు గుర్తువుంది. కాని నేను దానికి విరుద్ధంగా, రచయితలు ఆదర్శ ప్రజలను చిత్రించాలని ఆ విమర్శకులు కోరుతున్నారు. నిర్దిష్టమైన పాత్రలు మాత్రమే పాఠకునికి ఆదర్శవంతంగా వుంటాయని వారి వాదన. అది నిజమేనా? సాహితీ రచనలను వివిధ పాఠకులు వివిధ రకాలుగా అర్థంచేసుకొంటారు. పాఠకునియొక్క వయస్సును బట్టీ, మానసిక నిర్మాణాన్నిబట్టీ అది వుంటుంది. కొందరు నవలలోని ఆదర్శపాత్రలను అనుకరించడానికి ప్రయత్నించుతారు. మరికొందరికి అలాంటి పాత్రలు ఏవో మాయాపురాల నుండేవనీ, అందుబాటులో ఉండేవి కావనీ అనుకొంటారు. తప్పులుకూడా ఉండేటటువంటి పాత్రలనుండి ఆలాంటివారు గుణపాఠాలు నేర్చుకొంటారు. వారి తప్పులనుండి, విజయాల నుండి గుణపాఠాలు నేర్చుకొంటారు. వీరులు ఎలాపుట్టారో వారు తెలుసుకోదలచడంలేదు. వీరు ఎలా అవాలనేదే వారు తెలుసుకొనదలుస్తున్నారు.

ఫ్రెంచి స్కూలు పిల్లలకు, పండిత ప్రకాండులయిన ప్రాచీన విమర్శకులకు ప్రజలను ఎలా చిత్రించాలనే వాదవివాదాలను వదలివేదాం. మనం ప్రస్తుతం సజీవప్రజలను చిత్రించాలని తెలుసు. అలా చేయాలంటే, సత్యం, ఉద్వేగం, మానవత ఉండాలి. ఈ గుణాలు వాస్తవికతావాదికి, రొమాంటిసిస్టుకు కూడా కావలసిందే. ఒక సాహిత్యపద్ధతినుండి మరో పద్ధతిని

విడదీసే గుణాలు కావు అవి. కాని చెత్తాఖానీ సాహిత్యంనుంచి, కిరాయి సాహిత్యంనుండి వేరుచేసే గుణాలవి.

## 14

మన విమర్శకులొకరు ఇలా వ్రాశారు :

"వాస్తవికతలో, అనగా మానవస్వభావంలోని అపరిపక్వతల, వక్రతలకుగల కారణాల్ని నాశనంజేసిన సోషలిజంలో, ఆదర్శం మేళవించిన పక్షంలో, సోవియట్ సాహిత్యంలోని శిష్ట పాత్రలు తలయెత్తుతాయి." ఈ విమర్శకుని వాదనే సరియైనదయితే, 1948 లోని వాస్తవికత (ఈ వ్యాసం వ్రాసింది ఆ సంవత్సరంలోనే) ఆదర్శప్రాయమైనదయితే, సమగ్రమైనదైతే, సోషలిజంనుండి కమ్యూనిజానికి క్రమంగా పరివర్తన చెందాలని మనం చెప్పడం దేనికి? కొందరు విమర్శకులు రచయితలకు రాజకీయ పాఠాలు గరపాలని సంసిద్ధులవుతారు. కాని వారే మార్క్సిజం ప్రధాన సూత్రాలను సమగ్రంగా అర్థంచేసుకో లేదనీ, జీర్ణించుకొనలేకపోయారనీ నా భయం.

"మానవ స్వభావంలో అపరిపక్వతలకూ, వక్రతలకూ కారణాలు" సోషలిస్టు సమాజంలో నశింపజేయబడినాయని మనం అనగలమా ? సోషలిస్టు సమాజం పరివర్తనాదశలోని సమాజం. దానికి వెనుక పెట్టుబడిదారీ విధానంవుంది. ముందు కమ్యూనిజం వుంది. అక్టోబరు విప్లవం నూతన శకాన్ని ప్రారంభించింది. ఈ శకంలో ధనపూజా పద్ధతిస్థానే సృజనాత్మక శ్రమ విధానం వచ్చింది. ఇంతకుపూర్వం దురాశ, కాపీనం, పసీ

పాటు లేకుండా కూర్చోవడం మొదలైన అనేక దుర్గుణా లుండేవి. వాటిని సహించడమేగాక ఒక్కొక్కసారి వాటిని ప్రశంసించేవాళ్ళుకూడా. నేను వాటిని సోవియట్ ప్రజలు గర్హిస్తారు.

ఈ దుర్గుణాలు ఆత్మను తినేసేవి. ఇప్పుడవి చాలతక్కువే. అయినా పూర్తిగా అవి అదృశ్యమైపోలేదు. ఆత్మను చంపే రాచపుండ్లు మరికొన్ని వున్నాయి. ఒక నెలరోజుల వార్తా పత్రికల పైళ్ళను తిరగవేయండి. డాంబికం, కృతనిశ్చయం లేక పోవడం, అనవసర తొందరపాటు, జడత్వం, బుద్ధిహీనమైన మొండితనం మొదలైన "లోపాలూ, వక్రతలూ" గురించి విమర్శించే వ్యాసాలు కనబడతాయి.

ఇంకా కొన్ని లోసుగులు మన సమాజంలో వున్నా, రచయిత వాటిని పేర్కొనవసరంలేదని చాలమంది విమర్శ కులు, ప్రచురణాలయ సమీక్షకులు, పత్రికా సంపాదకులు భావించుతున్నారు. అలాంటి విమర్శకులూ, సంపాదకులూ, ఉత్తమ సోవియట్ ప్రజల జీవితాలను న్యూనతపరచే, తరచు క్లిష్టపరచే భావసంఘర్షణను చిత్రించరాదని మరింత పట్టు బడతారు.

సమాజంలో రచయిత పాత్రఏమిటి? అతని విధిఏమిటి? ప్రజలకు అతడు ఎలా సేవచేయాలి? మొదలైన ప్రశ్నలు యిక్కడ వస్తున్నాయి.

19వ శతాబ్దంలోని మహా రచయితలు సృష్టించిన పాత్రల గాథలు, వారి హృదయాలలో గాఢంగా నాటు కొన్నాయి. హ్యూగో, డికెన్స్, బాల్జాక్, స్టెంధాల్, ఫ్లాబ

ర్లు స్వార్థంతోను, అసత్యాలతోను నిండివున్న ప్రపంచాన్ని బట్టబయలు చేశారు. అంతకంటె ఎక్కువ గాఢమైన మానవతతో గత శతాబ్దపు రష్యన్ రచయితలు వ్రాశారు. బలవంతులు బలహీనులను, ధనికుడు బీదలను, పరాన్నభుక్కులు కష్టజీవులను, ఎలా పీడించారో చిత్రించారు. తమ రచనలలోని పాత్రలలాంటివారిని నాశనంచేసి చంపిన సామాజిక విధానాన్ని అంతమొందించే పోరాటంలో గత కాలంలోని పెద్దపెద్ద నవలా రచయితలు ప్రత్యక్షంగా పాల్గొనలేదు. బాల్జాక్, గొగోల్ లాంటి వారు కొందరు, తమ వ్రాతలలో ఎవరినైతే బట్టబయలు చేశారో, వాస్తవజీవితంలో అలాంటివారినే సమర్థించి వైరుధ్యాన్ని ప్రకటించారు.

మన ప్రజలు ఏ సమాజాన్ని నిర్మించడానికి కృషిచేస్తున్నారో ఆ కమ్యూనిస్టు సమాజం నిర్మించే కృషిలో ప్రతి సోవియట్ రచయితా భాగస్థుడవుతాడు. అందుకు తమ శక్తిని ధారపోస్తాడు. పుస్తకాలు ప్రజలను మార్చుతాయనీ, జీవితాన్ని మార్చుతాయనీ మనకు తెలుసు. అందుచే రచయితలు ప్రజా కార్యకలాపాల్లోనేగాక, తమ సాహిత్యంలోకూడ దీనికు కృషిచేస్తారు.

సాహిత్యం ప్రజలను జ్ఞానవంతులుగా చేస్తుంది. వారు ఇదివరకటికన్నా బాగా జీవించడానికి తోడ్పడుతుంది. వారి భావాలను ఉన్నత పథానికి కొనిపోతుంది. తమ బంధువుల, స్నేహితుల ఇతర ప్రజలందరిని గురించి ఎక్కువగా ఆలోచించేటట్లు చేస్తుంది. నవలలు, కథలు, కవిత, సమాజాన్ని బంధించే రాగబంధనాలు.

మన పనిలో మరో విషయంకూడావుంది. రచయిత, ఆంతరంగిక ఘర్షణలను, వైరుధ్యాలను చిత్రించాలి. తారుమారైన భావోద్వేగ లక్షణాలను అతను గమనించాలి. మానవ హృదయంలో మంచి చెడ్డల మధ్య జరుగుతున్న ఘర్షణపై కాంతిని ప్రసరింప చేయాలి.

వ్యవసాయంచేసే పద్ధతి బాగా లేకపోతే, వ్యవసాయ శాస్త్రజ్ఞుడు బాగా లేదని చెబుతాడు. ఏదైనా ఉత్పత్తి కేంద్రంలో ఫలితాలు సంతృప్తికరంగా లేవని ఇంజనీర్ గమనించితే, అతడా విషయాన్ని మరుగుపరచడు. బహిరంగమయిన తగాదాలను, అవి సమసిపోవడానికి కుదిరిన పరిష్కార మార్గాలను మాత్రమే చిత్రించడం రచయిత విధి కాదు. పుస్తకాల్లోగాని, వార్తా పత్రికల్లోగాని చర్చించని భావకల్లోలాలను కూడా అతడు చూపించాలి. మానవుని ఆంతరంగిక ప్రపంచాన్ని పాఠకులకంటె మరింత స్పష్టంగాను, పూర్తిగాను రచయిత చూడ కల్గితే, అవి అందరకూ తెలియకముందే ఆ విషయాలను తెలియ జేయకుండా ఎలా ఉండగల్గుతాడు? రచయిత స్థానం సరుకులతోనింపిన రైలుపెట్టెకాదు. ఏదో ప్రధాన కార్యాలయం లోని గుమాస్తాకాడు అతడు. మార్గాన్వేషి (స్కౌట్). అతడు అనుకరించడు. తన్ను ప్రదర్శించుకోడు. కాని కంటిచూపుకు కన్పడుతూ నిలబడతాడు.

మకరెంకో వ్రాసిన పుస్తకాలను చూసిన తర్వాత మన స్కూళ్ళలో చాలా మార్పులు చేయబడినాయి. "బీళ్ళు దున్నేరు" అనే పుస్తకం, నూతన మార్గాలకు గ్రామాలు పరి

వర్తనం చెందేట్లు చేసింది. "యుద్ధరంగం" (The front) అనేది మన సైన్యానికి చాలా సహాయపడింది.

మన పాఠకుల వ్యక్తిగత జీవితంలో అనేకమైన వైరుధ్యాలు లేవా? మనం పోరాడవలసివున్న గతకాలపు చిహ్నాలు మన ప్రజలలో ఇంకా మిగిలిలేవా? ప్రజా కార్యకలాపాలలో విరివిగా పాల్గొనే వ్యక్తిని తీసుకోండి. అతని బహిరంగ జీవితానికి, క్రమబద్ధం కాని అతని ఆంతరంగిక జీవితానికి మధ్య వైరుధ్యాలు అరుదేనా? ఇలాంటివి చాలా ఇతివృత్తాలు వున్నాయి. తమను ఉపయోగించుకొనేవా రెవరా అని రచయితలకోసం అవి ఎదురుచూస్తున్నాయి.

తమ కథానాయకుల పతనాన్ని చిత్రించినపుడు 19వ శతాబ్దపు గొప్ప రచయితలకు మరో మార్గంలేదు. మానవ జీవిత నాటకానికి గల సామాజిక కారణాలను వారిలో చాలా మంది అర్థంచేసుకొన్నారు. కాని అలాంటి సమాజాన్ని మార్చడం సాధ్యమనే విషయాన్ని వారు నమ్మలేదు. ఒక్కొక సారి వారి నిస్సహాయతను మతరీత్యానో, తాత్వికంగానో సమర్థించడానికి ప్రయత్నించారు. "ఆనా కెరినినా"కు చెప్పిన నీతివాక్యం "నేను పగతీర్చుకొంటాను. దెబ్బకు దెబ్బ తీస్తాను" అనేది కఠినమైనది. "థెరెసే రెక్వీన్" అనేదానికి టైన్ వ్రాసిన ఈ క్రింది నీతివాక్యం జోలా తీసుకొన్నాడు. "రసాయనిక పరిణామంవల్ల పంచదార, మైలతుత్తం ఎలా ఉద్భవించుతాయో, అలాగే సామాజిక జీవిత ఫలితంగా సుగుణాలూ, దుర్గుణాలూ తప్పనిసరియైనవి."

సోవియట్ రచయితకు దుర్గుణాలు పుట్టుమచ్చల లాంటివిగావు. బాధపడటం అనేది ఒక కర్మ అన్నట్లుగా చెప్పని సరియైన విషయం కాదు. సజీవమైన, హేతువాదతత్వంతో కూడిన సమాజంలో మనం నివసించుతున్నాం.

అన్ని యుగాలలోను రచయిత స్వప్నం మానవుని కాపాడటం. మన స్వప్నం నేడు నిజమైనది. ప్రజలచే ఎన్నుకోబడిన, ప్రజలను గౌరవించే వ్యక్తులచే మనదేశం పరిపాలింప బడుతూంది. ఇలాంటి అవకాశాలు చరిత్రలో ఎన్నడూ రచయితలకు లేవు. ప్రజలు మనకు అప్పజెప్పిన కర్తవ్యాన్ని నెరవేర్చటంలో మనం మనవిధిని పూర్తి చేయాలి.

# 15

రచయిత శిల్పం గురించి ఈ వ్యాఖ్యలను ఎంతో జంకుతో ప్రచురించడానికి నేను నిశ్చయించాను. ఇందులో చాలా విషయాలు వివాదగ్రస్తమైనవని నాకు తెలుసు. నా వ్యక్తిగత అనుభవాలను పాఠకులతో పంచుకోవాలని యివి వ్రాశానని మొదట్లోనే తెలియజేశాను. ఇతర రచయితలు మరికొన్ని విషయాలను ప్రముఖమైన విషయాలనే చెప్పవచ్చు. ఈ వ్యాఖ్యలపై రచయితముద్ర వున్నందువల్ల నేను జడం లేదు. నవలలో రచయితల ఇష్టానిష్టాలు, దురభిప్రాయాలు కూడా ఇమిడివుంటాయి. రచనను గురించి ఇలాంటి సమస్యలను లేవనెత్తవలసిన సమయం వచ్చిందా అని సందేహపడ్డాను. అలాంటి సమయం వచ్చిందనే నా అభిప్రాయం.

యుద్ధానంతరం పశ్చిమ యూరప్, అమెరికాలోని అనేక దేశాలలో నేను పర్యటించాను. ఆ సందర్భంలో విభిన్న రచయితలను కలుసుకున్నాను. "సాహిత్యానికి ఇది సమయం కాదు" అన్న నిరాశాపూరిత వచనాలు ప్రతిచోటా విన్నాను. మరుసటి రోజున ఏమవుతుందోనని ఈ సాయంకాలం భయపడుతున్న ప్రజల గాఢాందోళనను గురించి రచయితలు తెలియజేశారు. మరో యుద్ధం గురించిన వార్తలు, పెద్దపెట్టున సామాజిక కల్లోలాలు, రోజురోజూ దుర్భరమౌతున్న జీవన పరిస్థితులు, – ఇవన్నీ పుస్తకాలగురించి ప్రజలు ఆలోచించకుండా నిరోధించుతున్నాయి. కనీసం పుస్తకాల్ని తెరచి చూడటానికి కూడా బుద్ధిపుట్టకుండా అవరోధం కల్గించుతున్నాయి. పాశ్చాత్య దేశాలలోని వివిధ రచయితలు, ప్రతీదీ పతనోన్ముఖమైందని నాకు చెప్పారు. రచనాస్థాయి, ముద్రణాసంఖ్య, సాహిత్యంలో ప్రజల అభిరుచీ అన్నీ తగ్గిపోయాయని వారు చెప్పారు. "సైనికునికీ, రాజకీయవేత్తకూ, దౌత్య రాయబారోద్యోగికీ అంతా సులభమే. వాళ్ళు చేయవలసిన పనేమిటో వాళ్ళకు తెలుసు. కాని రచయిత ఎవ్వరికీ అక్కర్లేదు. ఇప్పుడు సాహిత్యానికి సమయం కాదు." అంటూ మరీమరీ వారు చెప్పారు.

మన దేశంలో ఉన్నత సాహిత్యానికి సమయం వచ్చిందని నా కనిపించుతోంది.

పాఠకుడు ఆశ్చర్యంగా ఇలా ప్రశ్నించవచ్చు "మన రచయితలకు అద్భుతమైన సౌకర్యాలున్నాయిగదా! వారు చక్కని పుస్తకాలు వ్రాయలేదా? మన దేశంలో నవలలు

లక్షలాది ప్రతులు అమ్ముడుపోవటం లేదా ? ఉత్తమ కానా, వందలకొలది నవలలు ఇతర భాషలలోకి అనువదించబడటం లేదా?"

ఇదంతా నిజమే. సోవియట్ రచయిత పరిస్థితులకు, పాశ్చాత్య దేశాలలోని చిత్రశుద్ధిగల రచయిత పరిస్థితులకూ పోలిక లేదు. పాశ్చాత్య దేశాలలోని ఆ రచయిత ఒక్కొక్కప్పుడు ప్రమాదభరిత జీవితాన్నికూడా గడపవలసివస్తుంటుంది. మన నవలల ముద్రణాసంఖ్యతో బూర్జువా దేశంలోని నవలల ముద్రణా సంఖ్య పోల్చడానికే వీలు లేదు. మన దేశంలో ఎన్ని ఎక్కువ వున్నా, మన సాహిత్యంపట్ల ప్రజలు చూపే అభిమానిని, ఫ్రాన్స్ ఇంగ్లాండులలో ఆధునిక సాహిత్యంపట్ల చూపే అభిమానికి పోలిక లేదు.

అయితే, మన దేశంలో గొప్ప సాహిత్యానికి సమయం ఆసన్నమయిందని నేను ఎందుకు చెబుతున్నాను ?

మన ఉత్తమ రచయితలు అద్భుతమైన గ్రంథాలు వ్రాసినమాట నిజమే. వాటిని ఆధునిక బూర్జువా నవలతో పోల్చిచూస్తే, కళాకారుని ఏ సమాజం ఉత్సాహపరుస్తున్నదో, ఏది అతనిని క్రుంగదీసి వేస్తున్నదో స్పష్టమవుతుంది. గొప్ప రచయిత లెప్పుడూ శూన్యంలోంచి ఊడిపడరు. చిత్తశుద్ధిగల సామాన్య రచయిత లెప్పుడూ వుంటారు. మన దేశంలోకూడా వున్నారు. పాశ్చాత్య దేశాలలోని సుప్రసిద్ధ ఆధునిక గ్రంథాలకన్నా ప్రశంసార్హమైన వీరి పుస్తకాలు చాలా మంచివి. అయితే మన పుస్తకాలను, మరణశయ్యపైనున్న పాశ్చాత్య ప్రపంచపు వేదనతో ఎందుకు పోల్చుకోవాలి ?

మన రాజ్యజీవితంలోని అన్ని దశలలోనూ, మన సాహిత్య వికాసాన్ని గురించి విమర్శకులు ప్రసంగించారు. కాని ఒక భవనాన్ని నిర్మించుతున్నపుడు ఇంటికప్పునుండిగాక, పునాదినుండి ప్రారంభించుతారు. ఆర్థికవిషయాలనుంచి ఉదాహరణ తీసుకోవాలంటే చిన్నపరిశ్రమలను పెంపొందించడానికి ముందు భారీపరిశ్రమలను స్థాపించాము. జీవితావసర వస్తువులు పుష్కలంగా లభించడం అనే సమస్య పుట్టకముందే దెస్నెప్రో కుజ్నెట్స్కు, మాగ్నిటోగార్స్క్ ఇనుము ఉక్కుమిల్లుల పునాది గోతులు త్రవ్వబడ్డాయి.

గత 35 ఏండ్లలో సోవియట్ సాహిత్యం చాలా సాధించింది. మన సమాజ సారాంశం ఏమిటో ప్రజలు అర్థంచేసుకోడానికి అది సహాయపడింది. మన ప్రజలు చేసిన అద్భుతమైన పనులు, సాధించిన విస్మయకర విజయాలు, ఘటనలూ మనం వర్ణించాం. ఫాసిస్టులు మన దేశంపై దాడిచేసినపుడు వారు కార్యరంగంలో, రణక్షేత్రంలో ఎలా నిలబడ్డారో చూపించాము. మన సాహిత్యం నిర్మాణానికై కృషిచేసింది; శత్రువుతో పోరాడింది.

సోవియట్ రచయితల గ్రంథాలు ప్రపంచభాష లన్నింటిలోకి దాదాపు అనువదింప బడ్డాయి. మహోనూతన ప్రపంచం ఆవిర్భవించిందన్న శుభవార్తను ఈ గ్రంథాలన్నీ అన్ని దేశాలకు అందించాయి. కళాప్రతిభలో వివిధ అంతస్తులలోవున్న ఈ గ్రంథాలు మన సమాజంలో మంచిలక్షణాలను చూపించాయి. మన దేశచరిత్ర కల్లోలపూరితం. ఈ చరిత్ర ప్రతిదశా, సోవియట్‌నవలలద్వారా మన స్నేహితుల మనస్సులలో

నాటుకొనివుంది. ప్రారంభదశలోని పారిశ్రామికదశను "సిమెంట్",
సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను "భీళ్ళు దున్నేరు" (Virgin
Soil Upturned),యుద్ధకాలదశను"వొలోకొలామస్క్-హైవే",
రాత్రింబవళ్ళు (Days and Nights), "ప్రజలజేయులు" (The
people are immortal) అనే నవలలు చిత్రించాయి. యుద్ధ
బీభత్సంనుండి పునర్నిర్మాణ దశను చూపించే "సౌఖ్యం"
(Happiness) "పంటసిరి" (Harvest) మొదలైన నవలలు
చిత్రించాయి (ఇది పూర్తిజాబితాకాదని వేరే చెప్పనక్కర్లేదు.
మన గ్రంథాలు నిర్వహించినపాత్రను నొక్కిచెప్పడమే
నా ఉద్దేశ్యం).

మన సమాజం ఇప్పుడే కొత్తగా ప్రారంభమైనది గనుక,
19 వశతాబ్దపు రచయితలకన్నా మనకు సమకాలిక ఇతివృత్తాలను
వ్రాయడం చాలా కష్టమని నేనిదివరకే చెప్పాను. యుద్ధం
మనకు అగ్నిపరీక్ష. ప్రజలీ యుద్ధంనుండి నైతికంగా బలపడి
కాకలుతీరి బయటపడ్డారు. నేడు శత్రువులు కత్తులు దూసి ఘుబీపి
స్తున్నా మన ప్రజలకు తమ శక్తి సామర్థ్యాలు తెలుసుగనుక
శాంతికి అంటిపెట్టుకొని వున్నారు. అప్పుడప్పుడు విదేశాలనుండి
వచ్చే వార్తలను చదువుతున్న సోవియట్ తల్లి ముఖంలో
విచారరేఖ కన్పడుతుంది. సోవియట్ స్త్రీ గత యుద్ధంలో
ఎన్నో బాధలకు లోనైంది. కాని ఇప్పుడామెకు గట్టిగా తెలుసు-
మన ప్రజలజేయులని. విచారధోరణిని పోగొట్టుకొని,తన నూత్న
శిశువువంక దరహాసంతో నేడు ఆమె చూస్తోంది. నేటిలాగా
ఇంత బలంగా మన సమాజం మున్నెన్నడూ లేదు. మన
సమాజంలోని మానవుని ముఖలక్షణాలు మరింత స్పష్టంగా

వున్నాయి; మరింత భావద్యోతకంగా వున్నాయి. మన సమాజం అనే నూతన భవనం ఎంతో సుఖమయంగా వుంది. కొత్త ప్రజలు విస్పష్టంగా కన్పించుతున్నారు. నా తరం రచయితలకు పూర్వం సాహిత్యకృషి సాగించాలంటే ఎన్నో కష్టాలు ఉండేవి. నేటి సోవియట్ సమాజాన్ని ప్రజలను సంపూర్ణంగా ప్రతిబింబించే వాస్తవిక చిత్రాన్ని ఈయడం నేను రచయితలకు సులభసాధ్యం.

మానవత్వానికి, న్యాయానికి శత్రువు లయినవారు సోవియట్ రాజ్యాన్ని, అది పుట్టిననాటినుండీ ద్వేషించు తున్నారు. సోవియట్ రాజ్యం బలపడగానే, ప్రపంచ కార్మిక ప్రజలకు ఆదర్శవంతమైన రాజ్యంకాగానే, వారు భయపడ సాగారు. సోషలిస్టు సమాజాభివృద్ధి ధోరణిని చూచికూడ వారు భయపడ్డారు. మన భవిష్యత్తునుగురించిగాక, ప్రస్తుతాన్ని జూచే నేడు వారు భయపడుతున్నారు. జీవితం ఎలా మారిపోయిందో వారు గమనించుతున్నారు. వాదనలకన్నా, సినాదాలకన్నా, మన దేశస్థితినిగురించి వాస్తవం తెలిపే అంకెలను జూచి వారు భయపడుతున్నారు.

సోవియట్ సాహిత్యంలో పరిపక్వతాకాలం వస్తున్నది. ఇంతవరకూ ఆ సాహిత్యంలో చిత్రించిన వీరోచిత కార్యాలవల్ల ముఖ్యంగా ఆ సాహిత్యం బలంగావుంది. ఈ కార్యాలను సాధించిన ప్రజలను చిత్రించుటద్వారా మన సాహిత్యం ఇక ముందు బలపడాలి.

మన దేశంలోని పాఠకులలాంటివాళ్ళు చరిత్రలో ఇది వరకు లేరు. పాఠకుల సభకు హాజరయినా, ఫ్యాక్టరీ లైబ్రరీలో

ఒక సాయం(త్రం గడిపినా, రచయితకు వచ్చే ఉత్తరాలనుచూసినా, పాఠకుల ఉత్సాహమూ, ఆదరణా, గాఢ ఆప్యాయతా తెలుస్తుంది. ఆ పాఠకులెవరు? పండిత ప్రకాండుల ముఠాలూ గాదు, లేక విప్లవ పూర్వకాలంలోవలె కొద్దిమంది మేధావులతో గూడిన ముఠాలూ కాదు. మన పాఠకులు ప్రజలు. మన రచయితలను పాశ్చాత్య దేశాలలోని అంతఃపుర సాహిత్యంతోగాని, డిటెక్టివ్ నవలలతోగాని పోల్చరాదు. మన పాఠకులతో పోల్చాలి.— అప్పుడు, "సాహిత్యంలో ప్రతిబింబితమైనదాని కన్నా ఈ ప్రజలు చాలా గొప్పవారు" అని ప్రతివారూ చెబుతారు.

నేను భవిష్యత్తును ఆశతో చూస్తున్నాను. లెనిన్‌గ్రాడ్ ఇంజనీరూ, లక్షలాది పాఠకులూ అద్భుత గ్రంథాలకోసం ఎదురుచూడవచ్చు. ఈ పుస్తకాలు ఆజ్ఞ ఇచ్చినమాత్రానగాని, పథకాలు వేసుకున్నంతమాత్రానగాని రావు. మన సమాజ ఉన్నత పరిస్థితీ, దాని బలమూ, దాని నైతిక శక్తీ, మన ప్రజలెంత మహోన్నత వ్యక్తులో అంత గొప్ప సాహిత్యమూ రానున్నది అని చెబుతున్నాయి.

రానున్నది

# క్రొత్తపాళీ

రచన: తాపీ ధర్మారావు

ప్రతులకు:
విశాలాంధ్ర ప్రచురణాలయం
బకింగ్‌హాంపేటపోస్టు - విజయవాడ.

Printed at Swatantra Art Printers, Vijayawada.